Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 33 • 16-8-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# సీమాంధ్ర సెగతో సోనియాగాంధీకి కాక!

సీమాంధ్ర సెగ సోనియాగాంధీకి కాక పుట్టిస్తున్నది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు అనుకొన్నంత సులభం కాదని ఆమెకు బాగా అర్ధమైపోయింది. యుపిఏ నిర్ణయం ముందు వరకు సీమాంధ్ర నుంచి ఉలుకు పలుకు లేవు. ఆ ప్రకటన వెలువడినప్పటి నుంచి అంతా కల్లోలమే. తమ నిర్ణయానికి ఎంతో కొంత ప్రతిఘటన తప్పదని కాంగ్రెస్ పెద్దలకూ తెలుసు. కానీ అదింత ఘాటుగా వుంటుందని మాత్రం వారు వూహించలేదు. సీమాంధ్ర కాంగ్రెస్‌వాదులు ఎంత దేశ ముదుర్లో సోనియాగాంధీకి బాగా అర్ధమైందిప్పుడు.

ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంలో తెలంగాణ ఏర్పాటు పట్ల వెల్లువెత్తుతున్న ఉద్యమం, దానికి మీడియాలో కల్పిస్తున్న విశేష ప్రాధాన్యం నిజంగా వూహకందనివే. సోనియాగాంధీ కాదు, రాష్ట్రంలోని రాజకీయ పరిశీలకులు కూడా ఈ పరిణామం చూసి ఆశ్చర్యపోతున్నారు. ఆంధ్ర ప్రజలలో రాష్ట్ర విభజన పట్ల ఇంతటి భావోద్వేగాలు వున్నాయన్న సమాచారం ఎవరి వద్దా లేదు. అందరూ అనుకొన్నది, ఆంధ్ర ప్రజలు పెద్దగా పట్టించుకోరని, ఒక్క రాయలసీమలో మాత్రం జగన్ కారణంగా కొంత అలజడి తప్పక పోవచ్చునని మాత్రమే. అయితే పరిస్థితి అందుకు భిన్నంగా వుంది. నిజంగా ఉద్యమం నడుస్తున్నదో లేదో తెలియదు కానీ, టీవీ ఛానళ్లు మాత్రం రాష్ట్రం తగలబడి పోతున్నదన్న ప్రచారం సృష్టించడంలో సఫలీకృతమౌతున్నాయి. ఏది నిజమో, ఏది కల్పనో ఎవరికీ అర్ధం కావడం లేదు. మరొక ప్రక్క జగన్ పార్టీకి పోటీగా కాంగ్రెస్, టిడిపి పార్టీలు కూడా వీధులలోకి వచ్చి గోల చేస్తున్నాయి. ఢిల్లీ పెద్దలకు ఆశ్చర్యం కల్గించే పరిణామం ఇది. తెలంగాణకు తాము అనుకూలమని స్పష్టంగా లేఖ ఇచ్చిన తర్వాత, పార్టీ అధ్యక్షుడు తెలంగాణ లేఖ మీద పునరాలోచన లేదని తేటతెల్లంగా ప్రకటన చేసిన తర్వాత కూడా తెలుగుదేశం నేతలు అభ్యంతరాలు చెప్పడం ఆశ్చర్యమే కదా?

## ముఖ్యమంత్రి అబద్ధాలు

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఉద్యమానికి పరోక్ష సహకారం అందిస్తున్నాడన్న విమర్శలొస్తున్నాయి. ప్రభుత్వం కఠినంగా వ్యవహరిస్తే ఉద్యమం చల్లారి పోతుందని, కానీ పోలీసును నిగ్రహించి, ఉద్యమం శాంతించకుండా ముఖ్యమంత్రే కాపాడుతున్నాడని తెలంగాణ వాదులు ఆరోపిస్తున్నారు. వారి ఆరోపణ ఆధారం లేనిది కాదని, కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రెస్ కాన్ఫరెన్స్ నిరూపించింది. ముఖ్యమంత్రి హోదాలో ఆయన తెలంగాణ విభజన పట్ల పిచ్చి ప్రశ్నలు లేవనెత్తాడు. కాకి లెక్కలు చెప్పి ప్రజలను గందరగోళంలోకి నెట్టాడు. తెలంగాణ ఏర్పడితే రాయలసీమ ఎడారిగా మారుతుందని భయపెట్టాడు. నిజానికి రాయలసీమ నీటికి తెలంగాణకు ఏమి సంబంధమో ఆయనకే తెలియాలి. శ్రీశైలం ప్రాజెక్ట్ నుంచి కృష్ణ వరద నీరు మొత్తాన్ని రాయలసీమకు తరలించడానికి వైఎస్ గట్టి ఏర్పాటు చేశాడు. పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్‌ను విశాలం చేశాడు. శ్రీశైలం వుండేది కర్నూలు జిల్లాలో. మరొకప్రక్క తెలంగాణ ప్రాంతం వున్నా, అదంతా కొండ ప్రాంతం. శ్రీశైలం నీరు వారు పారించుకోలేరు. తెలంగాణకు కృష్ణ నీటిని తరలించడానికి జూరాల ప్రాజెక్ట్ నుంచి మాత్రమే వసతి వుంది. అది చాలా చిన్న ప్రాజెక్ట్. కేవలం 6 టిఎంసిల నిల్వ సామర్థ్యం వున్న ప్రాజెక్ట్. అక్కడ కృష్ణ వరద నీటిని అడ్డగించడం ఎప్పటికీ జరిగే పని కాదు. ముఖ్యమంత్రి ఈ నిజం తెలియక కాదు, కానీ తెలంగాణ విభజన పట్ల ఆంధ్ర ప్రాంతం ప్రజలలో భయాన్ని, ఆందోళనను రెచ్చగొట్టాలన్న ఉద్దేశంతోనే పచ్చి అబద్ధాలు ప్రచారం చేస్తున్నాడని భావించాలి. ఆయన ఎందుకు చేస్తున్నాడా పని? తెలంగాణ ఏర్పాటు ఆయనకు ఇష్టం లేకుంటే కాంగ్రెస్ కోర్ కమిటీ సమావేశంలో, యుపిఏ సమ్మేళనంలో, ఢిల్లీ పెద్దల చర్చలలో వ్యక్తం చేసి వుండాలి. తెలంగాణ ఇవ్వక తప్పదని తెలిసినప్పుడు పక్కకు తప్పుకొని వుండాలి. అన్ని పరిణామాలను కళ్లారా చూస్తూ, ఇప్పుడు గొడవకు దిగడం ఎందుకు? ఆంధ్ర, రాయల సీమలలో తన ప్రతిష్ట పెంచుకోవాలనే ఆశ ఏదో వున్నట్లుంది ఆయనకు.

## సోనియా వెనక్కు పోదు

ఎవరెన్ని అభ్యంతరాలు చెప్పినా, సోనియాగాంధీ మాత్రం తన నిర్ణయాన్ని వెనక్కు తీసుకోదని అర్ధమైపోతున్నది. చిదంబరం, దిగ్విజయ్ సింగ్, అహ్మద్ పటేల్, ఆంటోనీ వంటి నేతలందరూ ఆ నిజాన్ని ఒకటికి పదిసార్లు స్పష్టం చేస్తున్నారు. అయితే ఆంధ్రలో నిరసన రోజు రోజుకూ పెరిగి పోతున్నది. ప్రభుత్వ ఉద్యోగులు ఉద్యమాన్ని తమ భుజాలకెత్తుకొన్నారు. విద్యా సంస్థలు వారిని సమర్ధిస్తున్నాయి. దానితో వీధులలో ఆందోళనకు జనం హాజరు పెరుగుతున్నది. ఈ ప్రతిఘటనను కాంగ్రెస్ అధిష్టానం ఎట్లా నిలువరిస్తుందో తెలియదు. కాకులు అరుస్తూనే వుంటాయి, కరవాడు ఎండుతూ వుంటుందన్నట్లు ఆంధ్రలో ఎంత గోల లేచినా తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ జరిపించేస్తారా? ప్రజల అభిమతానికి విరుద్ధంగా వెళ్లడం ప్రజాస్వామ్యంలో సాధ్యమా?

కొరవ 14వ పేజీలో

## జాతికి క్షమాపణ చెప్పాలి

సోనియాగాంధీ అల్లుడు రాబర్ట్ వదేరా భూ ఆక్రమణలు మరొకసారి వెలుగులోకి వచ్చాయి. ఢిల్లీ శివారులోని గుర్‌గావ్ ఒక ఖరీదైన ప్రాంతం. అది హర్యానా రాష్ట్రంలోకి వస్తుంది. ఆ రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలో వుంది. గుర్‌గావ్ ప్రాంతంలో భూమి విలువ బంగారంతో పోటీ పడుతూ వుంటుంది. దేశ రాజధాని నగరంలో భాగం కావడంతో అక్కడ భూమి క్రయ విక్రయాలపై కఠినమైన ఆంక్షలున్నాయి. అటువంటి విలువైన ప్రదేశంలో రాబర్ట్ వదేరా మూడున్నర ఎకరాల భూమి 7 కోట్ల 50 లక్షల రూపాయలకు ఒక కాంగ్రెస్ నేత కుటుంబం నుంచి కొనుగోలు చేశాడు. ఆ వెంటనే ఆ భూమికి హర్యానా రాష్ట్ర ప్రభుత్వం వాణిజ్యప్రాంత గుర్తింపు ఇచ్చింది. ఆ వెంటనే ప్రముఖ రియల్ ఎస్టేట్ కంపెనీ డిఎల్ఎఫ్ దాన్ని 58 కోట్ల రూపాయలు ఇచ్చి కొనుగోలు చేసింది. అంటే వాణిజ్య గుర్తింపు అనే ప్రభుత్వ అనుమతి ద్వారా రాబర్ట్ వదేరా దాదాపు 50 కోట్ల రూపాయల పైన లాభం సంపాదించాడన్న మాట. ఇక్కడ మరొక విశేషం – రాబర్ట్ వదేరా మొదట భూమి కొనడానికి చెల్లించిన సొమ్ము కూడా అదే డిఎల్ఎఫ్ సంస్థ నుంచి అప్పుగా తీసుకొన్నాడు. ఈ మొత్తం వ్యవహారంలో దగా ఏమిటో చిన్న పిల్లవాడికి కూడా చెప్పకుండానే అర్థమైపోతున్నది. కఠినమైన టౌన్ ప్లానింగ్ నిబంధనల నుంచి మినహాయింపు కోసం డిఎల్ఎఫ్ సంస్థ రాబర్ట్ వదేరాను రంగంలోకి దింపింది. ఆయన సోనియమ్మ అల్లుడు కాబట్టి క్షణాలలో అన్ని నిబంధనల అడ్డు తొలగించింది. అందుకు ప్రతిఫలంగా రాబర్ట్ వదేరాకు 50 కోట్ల నజరానా అందజేసింది.

67ఏళ్ల స్వాతంత్ర్య భారతదేశంలో 50ఏళ్లకు పైగా నెహ్రూ కుటుంబ పాలనే నడిచింది. ఆ కుటుంబానికి ప్రతినిధి రాబర్ట్ వదేరా. ఆ కుటుంబం మీద ఈ దేశ ప్రజానీకానికి అంత భక్తి. అంతటి విశ్వాసాన్ని తుక్కు 50 కోట్ల లంచం కోసం దారుణంగా ఒమ్ము చేశాడు రాబర్ట్ వదేరా. దేశాన్ని మోసం చేశాడు. సోనియమ్మ అల్లుడైనంత మాత్రాన రాబర్ట్ వదేరా వ్యాపారాలు చేయకూడదని ఎవరూ అనరు. కానీ సోనియమ్మ పలుకుబడి అడ్డం పెట్టుకొని, కార్పొరేట్ కంపెనీల దూత వలె వ్యవహరించడమే అభ్యంతరకరం. రాబర్ట్ వదేరా నడిపిన లావాదేవీల్లో చట్ట వ్యతిరేకం ఏదీ లేకపోవచ్చు. కానీ అందులో ధర్మ ద్రోహం మాత్రం స్పష్టం. తన తండ్రి పదవి అడ్డు పెట్టుకొని కోట్లు కొల్లగొట్టిన వైఎస్ జగన్‌కు వర్తింపచేసిన చట్టాలే రాబర్ట్ వదేరాకు కూడా వర్తింప చేయడం న్యాయం. కానీ కేంద్ర ప్రభుత్వంలో కానీ, హర్యానా రాష్ట్ర ప్రభుత్వంలో కానీ అంత మాత్రం దమ్ము, ధైర్యం వున్న మగాడు ఒక్కడూ లేడన్నది నిజం. ప్రధాన ప్రతిపక్షమైన బిజెపి కూడా నిన్న మొన్నటి వరకు రాబర్ట్ వదేరా ఆశ్రిత పక్షపాత వ్యవహారం పట్ల అలసత్వం ప్రదర్శించింది. సోనియాతో నేరుగా పేచీ పెట్టుకోవడానికి వెనుకాడింది. కానీ చివరకు ఒక సాధారణ ఐఎఎస్ అధికారి ఈ కుట్రను భగ్నం చేశాడు. మొత్తం దగాకోరు వ్యవహారాన్ని ఒక నివేదిక రూపంలో బయటపెట్టి ఈ దేశంలో ఇంకా వెన్నెముక వున్న అధికారులు మిగిలే వున్నారని నిరూపించాడు. అందుకాయన్ను మనసారా అభినందిస్తున్నాము.

ఇదే సమయంలో అగస్టా వెస్ట్‌ల్యాండ్ లంచాల భాగోతంలో ప్రధానమంత్రి కార్యాలయం పాత్ర స్పష్టంగా కన్పిస్తున్నదని కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ కొత్త నివేదిక ఇచ్చాడు. నిప్పులాంటి నిజాయితీకి పేరు పడిన ప్రధాని మన్మోహన్‌సింగ్ మీద ఇప్పటికే బొగ్గు కుంభకోణం మసి, 2జి గోల్మాల్ నీలి నీడలు అలముకొని వున్నాయి. దానికి ఈ రక్షణ శాఖ లంచాల కంపు అదనం. తన మీద ప్రజలు పెట్టుకొన్న నమ్మకాన్ని మన్మోహన్‌సింగ్ సైతం ఒమ్ము చేయడం నిజంగా విషాదకరం.

జమీన్‌రైతు

దేశంలో పెచ్చరిల్లిపోతున్న రాజకీయ అవినీతికి సోనియా ఇల్లు, మన్మోహన్‌సింగ్ కార్యాలయం ఆవాసంగా మారాయని ఈ రెండు ఘటనలు మరొకసారి నిరూపించాయి. ఇది ప్రజలను దారుణంగా వంచించడమే. ఈ నేరానికి వారిద్దరు కూడా చట్ట పరీక్షకు నిలవాలి. ప్రజాకోర్టులో విచారణ ఎదుర్కోవాలి. స్వాతంత్ర్య దిన సందర్భంగా ఎర్ర కోట బురుజు మీద నిలబడి, అవినీతి మీద ఆవేదన వ్యక్తం చేసినంత మాత్రాన మన్మోహన్‌సింగ్ బాధ్యత తీరిపోదు. తనకు తెలిసి జరిగినా, తెలియకుండా జరిగినా తన పేరుతో, తన పదవితో జరిగిన తప్పులకు ఆయన జాతికి క్షమాపణ చెప్పడం అవసరం.

## జనవాణి

### తెలుగుజాతి సమైక్యంగా ఉండాలంటే...

తెలుగుజాతి సమైక్యంగా వుండాలంటే కాంగ్రెస్, బిజెపి, తెలుగుదేశం పార్టీలు తాము చేసిన తప్పును సరిదిద్దుకోవాలి. మూడు పార్టీల రాష్ట్ర అధ్యక్షులు యూపీఏ ఛైర్‌పర్సన్ సోనియాగాంధీ వద్దకు వెళ్లి తాము సమైక్యంగా వుంటామని చెప్పాలి. భాషా ప్రయుక్త రాష్ట్రాలలో భాగంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడినా ప్రత్యేక తెలంగాణావాదాన్ని కాంగ్రెస్‌వాదులే 1969 నుండి భుజాన వేసుకొని మోశారు. ఇందులో డాక్టర్ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి కూడా మినహాయింపు లేదు. ఎటొచ్చి ఈ మూడు పార్టీలు ఆడుతున్న ఆటలో ప్రజలే ఓడుతున్నారు. ప్రపంచ బ్యాంకుకు దాసోహం అవడంలో బహుళజాతి కంపెనీలకు స్వాగతం పలకడంలో, దేశంలోని కోటీశ్వరులను శతసహస్ర కోటీశ్వరులుగా చేయడంలో, మన రాష్ట్రాన్ని, దేశాన్ని లక్షల కోట్ల అప్పుల్లోకి ముంచడంలో మూడు పార్టీలు భాగస్వాములే. వీరికి ప్రజల మీదకన్నా శత కోటీశ్వరుల మీద మోజు, ప్రేమ ఎక్కువ. వీరి పాలనలో దేశంలో ప్రాంతీయ అసమానతలు వచ్చాయి. దాన్ని ఆసరా చేసుకొని తమ రాజకీయ స్వార్థం కోసం ప్రాంతీయ వాదాలను బల పరుస్తున్నాయి. దేశంలోనూ, రాష్ట్రంలోనూ భాషా ప్రయుక్త రాష్ట్రాల వాదనకు కట్టుబడి, ప్రాంతీయ వాదానికి లొంగని పార్టీ సిపిఎం ఒక్కటే. తెలుగుజాతి కలిసి వుండాలంటే సమైక్య ఉద్యమకారులు తమ పోరాటంలో కొన్ని మార్పులు తేవాలి. కాంగ్రెస్, బిజెపి, టిడిపి పార్టీల వాళ్లు, ఆ పార్టీల అనుబంధ సంస్థలు ముందు తమ తమ పార్టీ అధినాయకత్వంపై యుద్ధం ప్రకటించాలి. ఢిల్లీ నుండి గల్లీ వరకు వున్న తమ పార్టీ కార్యాలయాల ముందు తమ నాయకుల ఇళ్ల ముందు ధర్నాలు చేయడం, నిలేయడం చేయాలి. లేదా ఉద్యమకారులు ఆ పార్టీలకు, అనుబంధ సంస్థలకు చిత్తశుద్ధితో రాజీనామా చేయాలి. అందరూ స్వతంత్ర సంస్థగా ఏర్పడాలి. అప్పుడు మాత్రమే కేంద్రం తలొగ్గి వస్తుంది.

పి.శ్రీరాములు ముంగమూరు

### క్యాలికులేటర్ ఇవ్వండి!

జమీన్‌రైతుకు డిసెంబర్ 1తేది నుంచి మార్చి 31తేది మధ్య చందా కట్టిన వారికి ఏదో ఒక ఉచిత బహుమతి ఇస్తున్నారు. ఇప్పటికే టార్చిలైట్లు, గడియారం, ప్లాస్టిక్ బుట్టలు, గొడుగుల వంటివెన్నో తీసుకొన్నాను. క్యాలికులేటర్ చాలా ముఖ్యమైన వస్తువు. దాన్ని ఇంతవరకు ఇవ్వలేదు. వచ్చే ఏడాది చందాదారులకు దాన్ని కానుకగా ఇవ్వమని కోరుతున్నాను.

వెంకటసుబ్బయ్య ములుమూడి

### పార్వతమ్మకు బాధ్యతలు అప్పజెప్పండి!

ప్రజా నాయకురాలు మాగుంట పార్వతమ్మ కావలి కాంగ్రెస్ రాజకీయాల్లో క్రియాశీలక పాత్ర నిర్వహించక పోవడం వల్లే ఇటీవల జరిగిన పంచా

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

20-8-1943
పేజీలు:4 వెల: 1-1-6

### గూడూరు వింతలు వినోదాలు!

ఈనాడు గూడూరంటే మైకా వ్యాపారంతో అంతర్జాతీయ ప్రఖ్యాతి బొందిన ముఖ్య వ్యాపార పట్నంగా మారింది. ఇక్కడున్నంత మంది పాశ్చాత్య దేశాల కేగి వచ్చిన ప్రతిభావంతులైన వ్యక్తులు ఆంధ్రదేశంలో మరెక్కడా లేరు. ఈలాంటి చోట ఎన్నో కొత్త అభిరుచులు, పాత చీదరలు, కశ్మలాలు, వింతలు, వినోదాలు, అభ్యుదయ ధర్మాలు, ఆదర్శమార్గాలు, సివిలిజేషన్ అనర్థాలు, వేలం వెర్రులు, ఎన్నో రకరకాల సరకులుంటవి వేంకటాచలపతి మార్కెట్టులో కావున యిది మొదలనే ఏనో కొన్ని ఏరి పాఠకలోకానికి అందిస్తుంటాను. పక్వ ఫలాలు భుజించి, కసుగాయలు కొరికి పారవేయండి. సుమధుర తావి విచ్చే గుసుమ గుచ్ఛాలుంటే ముచ్చు ఉండి. నిర్గంధ కుసుమాన్ని వెలికి దోయండి. దుర్గంధ కుసుమమయి తేపార వేయండి. ఇక శెలవు.

–మైకావాలా

***

ఒకనాడు నెల్లూరుజిల్లాలో 4 గురు ప్రతిభావంతులు అన్న వారలలో ఒకడైన సర్వంకష ప్రజ్ఞాశాలి పెల్లేటి రామిరెడ్డి గారి నామాక్షరములచే పునీతమైంది ఈ గూడూరు. ఆనాడు కేవలం రైతు గుణమే గాని అన్యవృత్తులు లేవు.

### కాకు సుబ్బరామరెడ్డి ప్రభృతుల విడుదల

కాకు సుబ్బరామరెడ్డి, జమీన్‌రైతు సహాయ సంపాదకుడు సిన్హా, నెల్లూరు వెంకట శేషయ్య, చొక్కా వెంకట సుబ్బయ్య గార్లను నెల్లూరు పోలీసు 5తేది రాత్రి డిఫెన్సు రూల్సు 129 క్రింద అరెస్టు చేసి 18తేది మధ్యాహ్నం విడుదల చేసిరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

15-8-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### జర్మనీకి సిద్దీపురం చాపలు

జర్మనీకి సరఫరా చేయుటకు ఆరు సిరి చాపలను సిద్దీపురం కాలనీలో నేయించి పంప వలసిందిగా బెంగుళూరులోని కేంద్ర చేతిపనుల అభివృద్ధి కేంద్రం వారు వెన్నెలకంటి రాఘవయ్య గారికి వ్రాశారు. చాపల నేతలో సిద్దీపురం వాసుల పనితనాన్ని మెచ్చుకుంటూ గూడా వ్రాశారు.

రూ15ల విలువ జేసే సిరి చాపలు గుడా సిద్దీపురంలో తయారవుతున్న వంటే, వాటి కళా విశేషాన్ని వూహించుకోవచ్చు.

### సదాలక్ష్మికి చీరల కాన్కలు!

శ్రీమతి సదాలక్ష్మి ఇటీవల నెల్లూరు జిల్లాలోని సుమారు 10 దేవాలయములు తనిఖీ చేసినపుడు ఒక్కొక్కచోట 180 మొదలు 200 వరకు ఖరీదు చేసే చీరెలను కానుకలుగా ప్రతి దేవాలయములోను తీసుకొనినట్లు తెలియుచున్నది. ఇది నిజమైతే మెచ్చుకునే పని గాదు. దేవుని ద్రవ్యాన్ని దుబారా చేసినట్లవుతుంది. కంచే చేను మేస్తే దేవాలయ దుర్వినియోగాలకు అడ్డు ఆపు యెక్కడ? ఆమె ఈ చీరెలను తిరుగా యిచ్చి వేయడం అత్యుత్తమం. ప్రకాశం పంతులు గారి మొదటి ముఖ్యమంత్రిత్వంలో ఒకానొక మంత్రిణికి కట్టబెట్టిన చీరెలను ఆయన మందలించి మరల యిప్పించివేశారు. యుద్ధ కాలములోనా ఇట్టి పొరపాట్లు? ఇప్పటికే లోప భూయిష్టమైన దేవాలయ పరిపాలనలోనా యిట్టి అవకతవకలు?

–వెన్నెలకంటి రాఘవయ్య

# నెల్లూరు ముచ్చట్లు

## సమ్మె విజయవంతం

సమైక్యాంధ్రను కాంక్షిస్తూ 12వ తేది అర్థరాత్రి నుంచి సకల జనులు చేసిన సమ్మె నెల్లూరులో విజయవంత మయ్యింది. ఉద్యోగస్తులంతా సమ్మెలో పాల్గొనడంతో ప్రభుత్వ కార్యాలయా లన్నీ మూతబడ్డాయి. ఆర్టీసి, ప్రైవేటు బస్సులు కదలకపోవడం, వ్యాపార వాణిజ్య సంస్థలు, స్కూళ్లు, కూరగాయల మార్కెట్, పెట్రోల్ బంకులు మూతబడ దంతో సమ్మె ప్రభావం కొట్టొచ్చినట్లు కనపడింది. ఆటోలు, ద్విచక్ర వాహనాల నడతను సమ్మె నిర్వాహకులు పెద్దగా పట్టించుకోకపోవడంతో అవి మాత్రం నడిచాయి.

## రంజాన్ ప్రార్థనలలోనూ సమైక్యాంధ్ర ప్రస్తావన!

నెల్లూరు చెరువు వద్ద గల ఈద్గా వద్దకు రంజాన్ పండుగను పురస్కరించు కొని నమాజ్ చదవను వేలాది మంది ముస్లిం సోదరులొస్తారు. 9వ తేది పం డుగ నమాజ్ అనంతరం జరిగిన 'దువా'లో సమైక్యాంధ్ర కొనసాగేలా 'అల్లా' దీవెన కావాలని ప్రార్థించడం చర్చనీయాంశమయ్యింది.

## హారన్ మోత మోగించిన టిప్పర్లు!

సమైక్యాంధ్రకు మద్దతుగా నిలి చిన టిప్పర్ల యాజమాన్యాలు 13వ తేది నగరంలో హారన్ మోత మోగిస్తూ నిర సన వ్యక్తం చేయడం జనాన్ని ఆకట్టు కొంది. నగరంలోని ఫోటోగ్రాఫర్లు, వీడియో గ్రాఫర్ల అసోసియేషన్ తమ ప్రదర్శనకు ముందు రాజస్థాన్ బ్యాండు మేళం పెట్టించారు. జంగం దేవరల సం ఘం నేతృత్వంలో చావుమేళం మ్రోగిస్తూ కెసిఆర్ దిష్టిబొమ్మకు జరిపిన శవయాత్ర జనాన్ని ఆకట్టుకొంది. వయ్యారపు నడక లతో హిజ్రాలు చేసిన ప్రదర్శన, కెసిఆర్ దిష్టిబొమ్మ దహనానికి ముందు వాళ్లు కార్చిన కన్నీళ్ల పర్వం రక్తి కట్టించింది. నెల్లూరు నిరసనకారుల మెదళ్లలో పుడుతున్న ఆలో చనలు 'వహ్వా' అనిపిస్తున్నాయి.

## ఎమ్మెల్యే కోసం వేచి చూడడమేమిటి?

నెల్లూరు చెరువు వద్ద వున్న ఈద్గా దగ్గర రంజాన్ నమాజు సందర్భంగా జనం ఈద్గా నిర్వాహకులపై తిరగబడిన విషయం వార్తల్లో నిలిచింది. మామూ లుగా రంజాన్ పండుగను పురస్కరించు కొని ముస్లిం సోదరులకు శుభాకాంక్షలు తెలపను ఈ ప్రాంతానికి ఎమ్మెల్యే వివేకా నందరెడ్డి ఏళ్ల తరబడి వస్తున్నారు. నమాజు జరిగే సమయంలో ఆయన రాకపై గతంలో విమర్శ రేగింది. దీంతో ఆయన దువా జరిగే సమయంలో వస్తు న్నారు. ఈసారి కలెక్టర్, ఎస్పీ, తన జంట ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డితో కలిసి ఈద్గా ప్రాంగణానికి వచ్చిన వివేకా 'దువా'లో పాల్గొనను కాస్త ఆలస్యం చేశారు. ఆయన కోసం ఈద్గా కమిటీ దువామొదలు పెట్టకపోయే సరికి ముస్లిం సోదరుల్లో ఒక్కసారిగా ఆగ్రహం కట్టలు తెంచుకోవడంతో ఆయన రాకమునుపే 'దువా' మొదలు పెట్టేశారు. దీంతో ఆయన నిలబడే ఈ కార్యక్రమంలో పాల్గొని పరువు నిలబెట్టుకొన్నారు.

## కోర్టు ఎదుట దెబ్బతినిపోయిన రోడ్డు!

నెల్లూరు ట్రంకురోడ్డుపై ఒకవైపు కొత్తగా సిమెంటు రోడ్డు వేస్తుండగా మరో వైపు రోడ్డు బాగా దెబ్బతిని పోయింది. జిల్లా కోర్టుకు తూర్పువైపు రోడ్డు పెద్ద పెద్ద గుంటలు పడిపోయినా తట్ట కంకరతో పూడ్చేవారు లేకుండా పోవడంతో ఇక్కడ వాహనాల నడత కష్టంగా మారింది.

## ట్రాఫిక్ పోలీసులు ఏమయ్యారు?

నెల్లూరులో ఇద్దరు ట్రాఫిక్ సిఐలు, పదుల సంఖ్యలో ఎస్ఐలు, వందల సం ఖ్యలో పోలీసులున్నారు. నగరంలో రోడ్ల మరమ్మత్తులు, సమైక్యాంధ్ర ఉద్యమం నేపథ్యంలో అరగంట కోసారి ట్రాఫిక్ నిలిచి పోతుంది. ఈ సెంటర్ ఆ సెంటర్ అనే తేడా లేకుండా నిలిచి పోతున్న ట్రాఫి క్‌ను సరిచేసేందుకు పోలీసులు కనపడ కుండా పోవడం విమర్శకు తావిస్తుంది. సిఐలు సురేష్‌కుమార్‌రెడ్డి, సుబ్బారావులు కుంభకర్ణ నిద్రను వీడితే బాగుంటుంది.

## అతి వక్త అబూబకర్!

మంచి ఉపన్యాసకుడిని అధివక్త అంటుంటారు. నెల్లూరు చెరువు దగ్గర ఉండే ఈద్గా దగ్గర రంజాన్, బక్రీద్ పం డుగల సమయంలో నమాజు చదివిం చను, ధార్మికోపన్యాసం చేయను కమిటీ నియమించిన అబూబకర్ అతివక్తగా మారుతున్నారు. సమయపాలన లేని ఆయన ఉపన్యాసఝరి నమాజుకు వచ్చిన వారిని ఇబ్బంది పెడుతున్నా ఆయన తన ధోరణి మార్చుకోవడం లేదు. తాను అతిగా మాట్లాడుతున్నానని ఆయనే చెప్పుకొంటూ దాన్ని కొనసాగిం చడం కొసమెరుపుగా చెప్పుకోవచ్చు. అబూబకర్ గారిని బక్రీద్ నమాజుకైనా ఈద్గా కమిటీ నియంత్రిస్తే బాగుంటుంది.

## కూర వండబల్లేదు!

సామాన్య మధ్యతరగతీయులు కూరవండి తినలేని దౌర్భాగ్య పరిస్థి తులు దాపురించాయి. దీనికి కారణం నెల్లూరు ఎసి మార్కెట్‌లోని మాఫియానే కారణమనాలి. కూరకు ముఖ్యమైన టమోటా, ఎర్రగడ్డలు, అల్లం రేట్లు ఎప్పుడు పడితే అప్పుడు ఇష్టమొచ్చినట్లు పెంచేస్తున్నారు వారు. రంజాన్, సకల జనుల సమ్మె ముందు రోజు దేశంలో ఎక్కడాలేనట్లు వంకాయలు కిలో 100 రూపాయలు, ఎర్రగడ్డలు 70 రూపాయ లకు మార్కెట్‌లో వ్యాపారులు అమ్మారు.



జాయింట్ కలెక్టర్‌గారు మీకు ఎన్నో పను లుండవచ్చు. నెల్లూరులో ఎసి కూరగా యల మార్కెట్‌లో మాఫియాను నియం త్రించే బాధ్యత మీరు స్వీకరించాలి సార్!

## చుక్కల్లో పూల ధరలు!

శ్రావణ మాసం, పెళ్లిళ్లను పురస్క రించుకొని నెల్లూరు పూలరేట్లు విపరీ తంగా పెరిగిపోయాయి. విడిగా మల్లెలు, సెంటు జాజులు లీటరు 120 రూపాయ లుగా పూల మార్కెట్‌లోనే అమ్ముతు న్నారు. శ్రావణ శుక్రవారం రోజు మూర కనకాంబరాలు 80 రూపాయలకు అమ్మారు. ఈ రేటుకు ఎవరు కొని కొప్పుల్లో ధరిస్తారు? పూజలో వినియోగి స్తారు?? దీనివల్ల దేవుళ్లకు బంతిమాల అర్చనలే జరుగుతున్నాయి.

## నెల్లూరులో జెడి లక్ష్మీనారాయణ!

సిబిఐ జాయింట్ డైరక్టర్‌గా రాష్ట్ర ప్రజల్లో ప్రత్యేక గుర్తింపు తెచ్చుకొన్న లక్ష్మీ నారాయణ 11వ తేది నెల్లూరు వచ్చారు. డిఆర్ ఉత్తమ హోటల్‌లో బసచేసిన ఆయన నారాయణ విద్యాసంస్థల అధి నేత పొంగూరు నారాయణ కుమార్తె వివా హానికి హాజరయ్యి, ఆ తర్వాత పెంచల కోనలోని లక్ష్మీనరసింహస్వామిని దర్శిం చుకొన్నారు. 11వ తేది సాయంత్రం హోట ల్‌లో కొందరు విలేకరులు ఆయన్ను కలిసి మాట్లాడమనగా నెల్లూరు పర్య టన వ్యక్తిగతమని మాట్లాడలేదాయన.

## భానుశ్రీ కుమార్తె పెళ్లికి రోడ్డు క్లియర్!

నెల్లూరు కెవిఆర్ పెట్రోల్ బంకు నుంచి జిల్లా కోర్టు వరకు కొత్తగా సిమెంటు రోడ్డు వేస్తున్నారు ప్రస్తుతం క్యూరింగ్ దశలో ఉన్న ఈ రోడ్డులో ఇప్పుడప్పుడే వాహనాలు తిరగకూడదు. కానీ 11వ తేది కస్తూరిదేవి స్కూల్ గ్రౌం డ్‌లో మాజీ మేయర్ భానుశ్రీ కుమార్తె వివాహాన్ని పురస్కరించుకొని నిబంధన లకు విరుద్ధంగా ఈ రోడ్డును క్లియర్ చేశారు. ఆర్అండ్‌బి అధికారులు. ఇదే మిటని అడిగితే తలతిక్క సమాధానాలు చెబుతారీ అధికారులు. ఈ వ్యవహా రంలో ఎవర్ని ఏమనాలో అర్థంకాని పరి స్థితి.

## నల్ల చొక్కాలో సోమిరెడ్డి!

సమైక్యాంధ్ర ఉద్యమంలో భాగంగా తెలుగుదేశం పార్టీ 10వ తేది చేపట్టిన నిరసనలో ఆ పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి నల్ల టీషర్ట్‌లో కనపడి అందర్నీ ఆకర్షిం చారు.

## అన్నపై జయ ధ్వజం!

ఆనం జయకుమార్‌రెడ్డి సమైక్యాం ధ్రకు మద్దతు పలుకుతూ రామలింగా పురం సెంటర్‌లోని తన తండ్రి ఆనం వెంకటరెడ్డి విగ్రహం వద్ద 12వ తేది నిర సన కార్యక్రమం చేపట్టారు. ఈ సంద ర్భంగా 1973లోనే ఆనం వెంకటరెడ్డి సమైక్య రాష్ట్రం కోసం పోరాడిన విష యాన్ని గుర్తుకు తెచ్చారు. ఈ విష యంలో ప్రజల మనోభావాలు గుర్తిం చక తన అన్న ఆనం రామనారాయణ రెడ్డి మంత్రి పదవికి రాజీనామా చేయక పోవడాన్ని తప్పుపట్టారు.



**జమీన్‌రైతు సారథి**



జమీన్‌రైతు రథ సారథిగా తన ఊపిరి వున్నంత కాలం సేవ చేసి తాను లేకున్నా కలకాలం జమీన్‌రైతు నిలిచేట్టు శ్రమించిన నిస్వార్థజీవి, జమీన్‌రైతు మేనేజింగ్ ఎడిటర్ **తూపిలి పార్థసారథి గారు** తనువు చాలించి 20తేదికి 34 సంవత్సరాలు నిండుతాయి. వారిని సంస్మరిస్తూ...

... జమీన్‌రైతు కుటుంబం

## నెల్లూరులో డెంగీ జ్వరపీడితులు!

వైద్య ఆరోగ్యశాఖ ప్రజారోగ్యం గూర్చి పట్టించుకోవడం మానేసింది. పేరుకొన్న చెత్తాచెదారాలతో జిల్లాలో డెంగీ జ్వరాలు విజృంభిస్తున్నాయి. ఆత్మ కూరులో మూడేళ్ల పాప సిరిమోజస్, కొత్తూరులో సిఏ చదివే విద్యార్థి హాజరా డెంగీ ధాటికి ప్రాణాలు విడిచారు. ఇక నైనా వైద్య ఆరోగ్య శాఖాధికారులు కుంభకర్ణ నిద్రను వీడాల్సి వుంది.

## అవనిగడ్డ శుభాకాంక్షలు!

జనవరి 1వ తేది, ఉగాదికి జనా నికి శుభాకాంక్షల వెల్లువ మొదలవు తుంది. నెల్లూరు కేంద్ర సహకార బ్యాం కులో మేనేజర్‌గా పనిచేసి రిటైర్ అయిన అవనిగడ్డ వేంకటకృష్ణమూర్తి ఫిఫ్త్‌ఫారం చదివే రోజుల నుంచి జనానికి స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు తెలియజేయడం రివాజుగా పెట్టుకొన్నారు. గూడూరులో ఆయన గురువు గులాంమహ్మద్ ఇచ్చిన

కొరవ 14వ పేజీలో

# కార్పొరేషన్ ఎన్నికల్లో పోటీకి పలువురు సిద్ధం!

● ఎన్నికలు జరిగేనా?

కార్పొరేషన్ ఎన్నికల్లో పోటీ చేసేందుకు పలువురు పోటీ పడుతుండడంతో ఈసారి జరిగే ఎన్నికలు రంజుగా మారనున్నాయి. తాజా మాజీ కార్పొరేటర్లతోపాటు పలువురు కొత్తవారు ఈ సారి ఎలాగైనా ఎన్నికల్లో పోటీ చేసేందుకు పురవురలాడుతున్నారు. అయితే గతంలో వున్న డివిజన్లు మారిపోవడం, కొత్త డివిజన్లు ఏర్పడడం, పలు డివిజన్ల రిజర్వేషన్ పరంగా మహిళలకు కేటాయించడంతో పరిస్థితి తారుమారయ్యింది. రిజర్వేషన్లపై జాబితా లోపాయి కారీగా వెల్లడి కావడంతో రాజకీయవర్గాల్లో ప్రచారం జోరందుకొంది. పలు డివిజన్లలో కార్పొరేటర్లుగా కొనసాగి ఇటీవల మాజీలైన వారు ఈ సారి ఎన్నికల్లో ఎక్కడి నుంచి పోటీచేయాలో అని మల్లగుల్లాలు పడుతున్నారు. ఎన్నో ఆశలతో తిరిగి కార్పొరేటర్లుగా నిలబడేందుకు సిద్ధమవుతున్న వారు రిజర్వేషన్ల గందరగోళంలో దిక్కుతోచని స్థితిలో పడిపోయారు. కాంగ్రెస్ పార్టీలో కార్పొరేటర్లుగా కొనసాగిన వారిలో చాలామందిలో ఇప్పుడే నిర్ణయం తీసుకోవాలా అన్న సందిగ్ధత నెలకొని వుంది. ఎమ్మెల్యే ఆనం వివేకానంద రెడ్డి కొంతకాలంగా పలువురు మాజీ కార్పొరేటర్లను దూరంగా పెట్టడం, ఆయా డివిజన్ల పరిధిలో కొత్త వారిని ప్రోత్సహిస్తుండడంతో అలకపూని వున్న పలువురు ఇతర పార్టీల్లో చేరే ఆలోచనల్లో వున్నట్లు సమాచారం. మరికొందరు మహిళలకు రిజర్వేషన్ అయిన డివిజన్లలో తమ కుటుంబసభ్యులను నిలిపే ప్రయత్నాల్లో వున్నారు. మొత్తంమీద కార్పొరేషన్ పరిధిలో జరిగిన డివిజన్ల రిజర్వేషన్ ప్రక్రియతో రాజకీయ రంగులు మారనున్నాయి.

# ఇబ్బంది పెడుతున్న ఏటిఎంలు!

● పట్టించుకోని బ్యాంకులు

బ్యాంకు ఖాతాదారులు సులువుగా అవసరమైనప్పుడు డబ్బులు డ్రా చేసుకొనేందుకు ఏర్పాటు చేసిన ఏటిఎంలు ఇప్పుడు చికాకు పెడుతున్నాయి. వివిధ బ్యాంక్‌లు నగరంలో పలు ప్రాంతాల్లో ఇబ్బడి ముబ్బడిగా ఏటిఎం సెంటర్‌లను ఏర్పాటు చేశాయి. కరెంటుతో పనిచేసే ఎంటిఎంలతోపాటు సోలార్ పవర్‌తో పనిచేసే ఏటిఎంలు వున్నాయి. ఎన్నింటిని ఏర్పాటు చేసినప్పటికీ బ్యాంక్‌లు వాటి నిర్వహణను సక్రమంగా చేయకపోవడంతో ఖాతాదారులు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. చాలా మటుకు ఆంధ్రా బ్యాంక్ ఆధ్వర్యంలో నడిచే ఏటిఎం కేంద్రాలలో తరచూ సమస్యలు ఎదురౌతున్నాయి. పొగతోట, బృందావనం, వేదాయపాళెం తదితర ప్రాంతాలలోని ఆంధ్రాబ్యాంక్ ఎంటిఎం సెంటర్లలో ఏటిఎం పనిచేయడం లేదనో, డబ్బు లేదనో, ప్రింటర్ పనిచేయడం లేదనో బోర్డులు అక్కడికి డబ్బు డ్రా చేసుకొనేందుకు వెళ్లే ఖాతాదారులకు స్వాగతం పలకడం పరిపాటి అయ్యింది. ఇక స్టేట్ బ్యాంక్ ఏటిఎంలదీ ఇదే పరిస్థితి. మిగతా ఏటిఎంలలో బటన్‌లు సరిగా పనిచేయడం లేదని, ఒక దానిమీద నొక్కితే మరొక దానిపై పడడం లాంటి సమస్యలను ఎదుర్కొంటున్నారు ఖాతాదారులు. ఏటిఎం సెంటర్ల నిర్వహణ అధ్వాన్నంగా వుంటోంది. అక్కడ ఏర్పాటుచేసిన ఏసిల బాగోగులు పట్టించుకోకపోవడంతో దుమ్ము కొట్టుకుపోయి వున్నాయి. వినియోగదారులకు సేవలందించడంలో తమ బ్యాంక్ గొప్పంటే, తమ బ్యాంక్ గొప్ప అని డబ్బా కొట్టుకొనే ఆయా బ్యాంక్‌లు ఏటిఎంల నిర్వహణపై శ్రద్ధ పెట్టాలని, ఇబ్బంది కలుగకుండా చూడాలని పలువురు ఖాతాదారులు కోరుకొంటున్నారు.



ప్రజలకు ఉపయోగపడని ఏటిఎంలు.

# ఎమ్పీడిఓలకు కాన్పుల బాధ్యతలు!

● కలెక్టర్ ఆదేశం

మండల పరిషత్ అభివృద్ధి అధికారులకు కాన్పుల బాధ్యతలు అప్పగిస్తూ జిల్లా కలెక్టర్ శ్రీకాంత్ నిర్ణయం తీసుకున్నారు. ఇప్పటివరకు వైద్య ఆరోగ్య శాఖ సిబ్బందే కాన్పులను ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో చేయించేవారు. ఈ నెల నుండి ఎమ్పీడిఓలు కూడా కాన్పులు చేయించేందుకు బాధ్యతలు తీసుకోవాల్సి వుంటుంది. ఇటీవల నెల్లూరు నగరంలో నిర్వహించిన సమీక్షా సమావేశంలో కలెక్టర్ తన నిర్ణయం ప్రకటించడంతో అధికారులు ఆశ్చర్యపోవాల్సి వచ్చింది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో తప్పని సరిగా కాన్పులు జరగాలని, సదుపాయాలులేని ఆసుపత్రులను ఒకవేళ మినహాయించినా మండల స్థాయిలో ఏదో ఒక పిహెచ్‌సిలో కాన్పులు చేయాల్సిన అవసరం వుందన్నారు. వైద్యులు, సిబ్బంది కొరత సాకుతో తప్పించుకోవద్దని సున్నితంగా హెచ్చరించారు. గర్భిణులకు ప్రసవ సమయం దగ్గర పడిన వెంటనే 108 వాహనం ద్వారా సమీప పిహెచ్‌సికి తరలించి, కాన్పు జరిగిన తర్వాత 108 వాహనంలోనే ఇంటికి చేర్చాలన్నారు. ఆటోలు, ప్రైవేటు వాహనాల్లో ప్రయాణిస్తే, సంబంధిత ఎఎన్ఎంలపై చర్యలు తీసుకోవాలని డిఎంఅండ్‌హెచ్‌ఓను ఆదేశించారు. ఇప్పటివరకు మండల కార్యాలయాలకే పరిమితమై వున్న ఎమ్పీడిఓలు ఇక నుంచి గ్రామీణ ప్రాంతాల్లో పర్యటించి గర్భిణీల వివరాలు సేకరించి, పిహెచ్‌సిల్లో కాన్పులు చేయించాలి. కలెక్టర్ తీసుకున్న ఈ నిర్ణయం పట్ల ఏ ఒక్కరు కూడా సమావేశంలో వ్యతిరేకించక పోయినప్పటికీ ఒకరికొకరు చర్చించుకోవడం చర్చనీయాంశంగా కనిపించింది.

# బంద్‌లు... పెళ్లిళ్లు... రోడ్డు పనులు!

● నెల్లూరులో ట్రాఫిక్ నడతకు అమ్మా-అబ్బాలేరు

నగరంలో ట్రాఫిక్ పద్మవ్యూహాన్ని తలపిస్తోంది. అసలే ఇరుకు రోడ్లు, ఆ పై రోడ్లపైకి వచ్చిన ర్యాంప్‌లతో నడవడానికే కష్టంగా వుండే రోడ్లలో ఇక ట్రాఫిక్ నడత ఏ విధంగా వుంటుందో చెప్పనవసరం లేదు. అలాంటి నగరంలో రోడ్ల మరమ్మత్తులు చేస్తుండడంతో అయ్యప్పగుడి నుంచి ఆత్మకూరు బస్టాండు వరకు ప్రధాన రహదారి, మినీ బైపాస్ రెండువైపులా ఎక్కడికక్కడ ట్రాఫిక్ నిలిచిపోతుంది. దీనికితోడు సమైక్యాంధ్ర కోరుతూ విద్యార్థులు, రాజకీయ పార్టీలు, ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలు రోడ్డెక్కడంతో బంద్‌లు, ధర్నాలు, రాస్తారోకోలు చేస్తుండడంతో అడుగు తీసి అడుగు వేయలేనంతగా ట్రాఫిక్ నిలబడి పోతోంది. దీంతో వాహనాల్లో వెళ్లేవారు నరకం చవిచూస్తున్నారు. నడిచి వెళ్లే వారికి ఇబ్బందిగా వుంటోంది. వీటికితోడు శ్రావణ మాసం రావడంతో పెళ్లిళ్లకు సందే లేదు. ఎక్కడ చూసినా వివాహాలు జరుగుతుండడంతో వాటికి హాజరయ్యే వారికి రోడ్ల మరమ్మత్తు పనులు, సమైక్యాంధ్ర ఉద్యమం, ముందుకు కదలని ట్రాఫిక్ తీవ్రంగా ఇబ్బంది పెడుతోంది. చివరకు పెళ్లి చేసుకొనే వధూవరులు వాహనాల్లో చిక్కుకుని పోతున్నారు. అంతగా నగరంలో ట్రాఫిక్ సమస్యను ఎదుర్కొంటున్నారు. రద్దీగా వుండే ప్రాంతాలతోపాటు చిన్నపాటి రోడ్లు, సందు గొందుల్లో వాహనాలు నిలిచిపోతూ రాకపోకలకు అంతరాయం ఏర్పడుతోంది. అదేమి విచిత్రమోగానీ మెయిన్‌రోడ్డుతోపాటు ఎక్కడా ట్రాఫిక్‌ను క్రమబద్ధీకరించను ఒక్క ట్రాఫిక్ పోలీసు కనపడడం లేదు.


విజయమహల్ అండర్ బ్రిడ్జివైపుకు మళ్లిన ట్రాఫిక్.

## కొనసాగుతున్న 108 సిబ్బంది సమ్మె!

జిల్లావ్యాప్తంగా తమ సమస్యల పరిష్కారం కోసం 108 సిబ్బంది తలపెట్టిన సమ్మె కొనసాగుతోంది. దాదాపు నెల రోజుల నుండి విధులను బహిష్కరించి సమ్మె చేస్తున్నప్పటికీ ప్రభుత్వం ఏమాత్రం పట్టించుకోవడం లేదు. వివిధ రూపాల్లో తమ నిరసనలు వ్యక్తం చేస్తున్నారు. కళ్లకు గంతలు కట్టుకోవడం, నగరంలో భిక్షాటన చేయడం, వీధుల్ని శుభ్రం చేయడం వంటి వినూత్న కార్యక్రమాలు చేస్తున్నారు. సిబ్బంది సమ్మెకు వెళ్లడంతో 108 వాహనాల సర్వీసుకు కొంత విరామం ఏర్పడింది. ప్రభుత్వం ఆదేశాలతో ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేస్తున్నారు. అయితే ఆశించినమేర

### పట్టించుకోని ప్రభుత్వం

సిబ్బంది నియామకం చేయలేక పోతున్నారు. ఇటీవల జిల్లా వైద్య ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో 108 వాహనంలో విధులు నిర్వహించేందుకు సిబ్బంది నియామకం జరిపారు. నియామకాలను అడ్డుకొనేందుకు సిబ్బంది ప్రయత్నించి విఫలం చెందారు. జివికె యాజమాన్యం సైతం చర్చల పేరుతో కాలయాపన చేస్తుందని సిబ్బంది ఆరోపిస్తున్నారు. కార్మిక శాఖ చట్టాల ప్రకారం వేతనాలు చెల్లించాలన్న ఆదేశాలున్నప్పటికీ వాటిని అమలు చేసేందుకు జివికె యాజమాన్యం నిరాకరిస్తుందని వాపోతున్నారు. వీరి దీక్షకు వివిధ సంఘాల నేతలు సంఘీభావం తెలుపుతున్నారు.

విద్యార్థులు రోడ్డుపై నిర్వహించిన మాక్ కోర్టు.

ధనదాహంతో, స్వార్థంతో సొంతంగా ఆస్తులు కూడబెట్టుకొనేందుకు, కుటుంబసభ్యుల సహకారంతో రాష్ట్ర ప్రజలను బెదిరించి దండకాలు సాగిస్తూ, చివ

# విద్యార్థి జెఎసి కోర్టులో కెసిఆర్‌కు ఉరిశిక్ష!

ఆకట్టుకొన్న కార్యక్రమం

రకు విభజనకు కారణమైన కోట్లాది మంది ప్రజల మనోభావాలను దెబ్బతీసిన కెసిఆర్‌కు ఉరిశిక్ష విధించడమే సమంజసమని ప్రజాకోర్టు తీర్పు వెలువరించింది. విద్యార్థి జెఏసి ఆధ్వర్యంలో సమైక్యాంధ్రను కాంక్షిస్తూ గత కొన్ని రోజులుగా వివిధ రకాలుగా నిరసన కార్యక్రమాలు చేపడుతున్న విషయం తెలిసిందే. ఇందులో భాగంగా ఆగష్టు 9న ప్రజాకోర్టు పేరుతో వినూత్న తరహాలో ఒక కార్యక్రమాన్ని తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావాలని, విభజన వద్దని కోరుతూ కోర్టులో వాదోపవాదాలు జరిగినట్లు నాటకాన్ని రూపొందించి నిర్వహించారు. విఆర్ కళాశాల కూడలిలో జరిగిన ఈ కార్యక్రమం పలువురిని ఆకట్టుకొంది. విద్యార్థులు తెలంగాణ, ఆంధ్ర ప్రాంతం వారిగా విడిపోవడం, లాయర్ల వేషంలో వాదనలు, జడ్జి స్థానంలో ఒక విద్యార్థి కూర్చొని కేసు పూర్వాపరాలు పరిశీలించడం, ఈ సందర్భంగా జరిగిన సంభాషణలు ప్రజలను ఆకట్టుకొన్నాయి. తెలుగునాడు స్టూడెంట్స్ ఫెడరేషన్(టిఎన్ఎస్ఎఫ్) ఆధ్వర్యంలో జరిగిన ఈ ప్రజాకోర్టు అనే కార్యక్రమంలో చివరకు తెలంగాణ రాష్ట్ర సమితి అధ్యక్షుడు కె.చంద్రశేఖర్‌రావుకు ఐపిసి 302 సెక్షన్ క్రింద ఉరిశిక్ష విధిస్తూ తీర్పు చెప్పడంతో ఈ కార్యక్రమం ముగిసింది.

# గూడూరు పంచాయతీ ఎన్నికల్లో కాంగ్రెస్ ఆధిపత్యం!

గూడూరు నియోజకవర్గంలో జరిగిన పంచాయతీ ఎన్నికల్లో కాంగ్రెస్ అత్యధిక స్థానాల్లో తాము బలపరచిన అభ్యర్థులను గెలిపించుకొంది. మొత్తం 117 పంచాయతీలకుగాను 116 పంచాయతీ స్థానాల్లో ఎన్నికలు జరిగాయి. చిట్టమూరు మండలంలోని రంగనాథపురం పంచాయతీని ఎస్సీలకు కేటాయించడం, ఎస్సీ ఓటర్లు ఎవరూ లేకపోవడం, సర్పంచ్ అభ్యర్థిగా ఎవరూ పోటీ చేయక పోవడంతో అక్కడ ఎన్నిక జరగలేదు. మిగిలిన 116 స్థానాల్లో కాంగ్రెస్ 43, తెలుగుదేశం 34, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ 34, ఇండిపెండెంట్లు 5 స్థానాల్లో గెలుపొందారు. నియోజకవర్గంలోని మేజర్ పంచాయతీలైన చిల్లకూరు, నెల్లటూరు, దివిపాళెం, కోట పంచాయతీలలో వైకాపా మద్దతుదారులు విజయం సాధించారు. గూడూరు మండలంలోని పలు పంచాయతీల్లో కాంగ్రెస్ పార్టీలోని ముఖ్య నేతలు బలపరచిన అభ్యర్థులు ఓటమి చెందారు. గూడూరు వ్యవసాయ మార్కెట్ కమిటీ ఛైర్మన్ బాబురెడ్డి సొంతూరు వెడిచర్లలో తమ అభ్యర్థిని గెలిపించుకోలేకపోయాడు. ఆ స్థానంలో టిడిపి విజయం సాధించింది. మిట్టాత్మకూరు పంచాయతీలో వైకాపా అభ్యర్థిని శ్రీదేవమ్మ కాంగ్రెస్ అభ్యర్థిని మమతమ్మపై విజయం సాధించింది. నియోజకవర్గ పరిధిలో అధిక స్థానాలు కాంగ్రెస్ గెలుచుకొన్నప్పటికీ పార్టీకి చెందిన చాలామంది ముఖ్య నాయకులకు ఈ ఎన్నికలలో గట్టి ఎదురు దెబ్బ తగిలింది.



స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు పెరేడ్ గ్రౌండ్‌లో పోలీసు గౌరవ వందనాన్ని స్వీకరిస్తున్న రాష్ట్ర ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి.

# కలువాయిలో సమైక్యవాదం!

## ర్యాలీలు, మానవహారాలు ప్రదర్శనల హోరు



కలువాయిలో కొవ్వొత్తుల ప్రదర్శన చేస్తున్న యువకులు.

కలువాయి మండలంలో సమైక్యవాదం బలంగా విన్పడుతోంది. తెలుగు ప్రజలందరూ ఒకటిగా వుండాలని తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం పేరుతో రాష్ట్రాన్ని చీల్చొద్దంటూ ఎవరికివారు స్వచ్ఛందంగా చేస్తున్న కార్యక్రమాలతో మండలం దద్దరిల్లుతోంది. విద్యార్థులు, యువకులు, ఉపాధ్యాయులు, వ్యాపారస్తులు, వివిధ రూపాల్లో తమ నిరసనను తెలుపుతున్నారు. ర్యాలీలు, మానవహారాలు, బంద్‌లు, రాస్తారోకోలు చేస్తుండడంతో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడుతోంది. కెసిఆర్, సోనియా దిష్టి బొమ్మలను తగులబెట్టడంతోపాటు కలువాయి మండల కేంద్రంలో కొవ్వొత్తుల ప్రదర్శన నిర్వహించారు. సీమాంధ్ర ప్రజాప్రతినిధులు తమ పదవులకు రాజీనామా చేయాలని, ఉద్యమాన్ని ముందుండి నడిపించాలని కోరారు. ఈ సందర్భంగా తెలంగాణ వద్దు సమైక్యాంధ్ర ముద్దు అంటూ చేసిన నినాదాలతో గ్రామం దద్దరిల్లిపోయింది. సమైక్యాంధ్ర కోరుతూ చేస్తున్న నిరసనలు, బంద్‌ల కారణంగా మండల పరిధిలో విద్యాసంస్థలు పదిరోజులుగా మూతపడడంతో విద్యార్థుల చదువులు అటకెక్కాయి. మొత్తంమీద సమైక్యాంధ్ర కోరుతూ చేస్తున్న కార్యక్రమాలతో రోజురోజుకూ ఈ కాంక్ష ఈ ప్రాంతంలో బలపడుతోంది.

# గూడూరులో ఊపందుకొన్న సమైక్యాంధ్ర ఉద్యమం!

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు ప్రకటనను నిరసిస్తూ గూడూరు పట్టణంలో వివిధ వర్గాల ప్రజలు ఉద్యమిస్తున్నారు. విద్యార్థి సంఘాలు, కళాశాల, పాఠశాలల సిబ్బంది, ఆటో వర్కర్స్ యూనియన్, ట్యాక్సీ యూనియన్లు, మత్స్యకారులు, తోపుడు బండ్ల వ్యాపారులు కాంగ్రెస్ ప్రభుత్వ తీరును నిరసిస్తూ, తెలుగు ప్రజలు సమైక్యంగా వుండాలని నినదిస్తూ పట్టణంలో వేరువేరు కార్యక్రమాలు నిర్వహిస్తుండడంతో సమైక్య ఉద్యమం ఊపందుకొంది. క్లాక్ టవర్ కూడలి వద్ద ధర్నా నిర్వహించడంతోపాటు

## అన్ని కార్మిక సంఘాల మద్దతు

అక్కడే వంటా వార్పు చేపట్టి భోజనాలు చేశారు. అనంతరం బైపాసురోడ్డుకు చేరుకొని రాస్తారోకో నిర్వహించడంతో ట్రాఫిక్‌కు తీవ్ర అంతరాయం ఏర్పడింది. మరికొందరు విద్యార్థులు రహదారిపైనే క్రికెట్, వాలీబాల్ ఆటలు ఆడి తమ నిరసన తెలిపారు. మత్స్యకారులు కెసిఆర్ దిష్టిబొమ్మకు శవయాత్ర నిర్వహించారు. కొందరు నిరసనకారులు అరగుండు గీయించుకొని వివిధ రూపాల్లో నిరసన వ్యక్తం చేశారు.

# రామనారాయణరెడ్డి, చింతా కనపడుటలేదు!

● వెంకటగిరి పోలీస్‌స్టేషన్‌లో జనం ఫిర్యాదు

జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, తిరుపతి పార్లమెంటు సభ్యుడు చింతా మోహన్ కన్పించడం లేదంటూ ఈ మేరకు వెంకటగిరిలో పోలీసులకు ఫిర్యాదు అందింది. సమైక్యాంధ్ర కోసం జరుగుతున్న ఉద్యమంలో వీరిరువురూ పాలుపంచుకోకపోవడం, అసలు జిల్లాలో కన్పించకపోవడంతో సమైక్యాంధ్ర పోరాట సమితి సభ్యులు స్థానిక పోలీస్ స్టేషన్‌లో ఆనం, చింతా మిస్సింగ్‌గా ఫిర్యాదు చేయడం ప్రాధాన్యత సంతరించుకొంది. ఈ ఫిర్యాదు అనంతరం సమైక్యాంధ్ర పోరాట కమిటీ సభ్యుడు ఉదయకుమార్ మాట్లాడుతూ ఆంధ్ర రాష్ట్రాన్ని కొందరు స్వలాభం కోసం విభజిస్తుంటే బాధ్యతాయుతమైన పదవుల్లో వున్న ఆనం రామనారాయణరెడ్డి, చింతా మోహన్ దీనిపై స్పందించకపోవడం, ఆందోళనలో పాల్గొనకపోవడం గర్హనీయం అన్నారు. వీరు ఎక్కడా కన్పించనందున వెతికి పెట్టమని పోలీసులకు ఫిర్యాదు చేయాల్సి వచ్చిందన్నారు.

# కుల్లూరు సర్పంచ్ అభినందన సభ!

## పాల్గొన్న మాదాసు నళినమ్మ

పంచాయతీ ఎన్నికల్లో కలువాయి మండలంలోని మిగతా పంచాయతీల్లో గెలిచిన వారికంటే అత్యధికంగా మెజార్టీ సాధించి కుల్లూరు సర్పంచ్‌గా ఎన్నికైన భూపతి కొండయ్య అభినందన సభ ఇటీవల స్థానికంగా జరిగింది. పిసిసి ఉపాధ్యక్షుడు మాదాసు గంగాధరం ఆశీస్సులతో ఎన్నికల్లో దిగి గట్టి పోటీ ఎదుర్కొని కొండయ్య విజయం సాధించడం తెలిసిందే. ఈ అభినందన సభకు మాదాసు సతీమణి నళినమ్మ ముఖ్య అతిథిగా హాజరై పంచాయతీ సర్పంచ్‌గా ఎన్నికైన కొండయ్య తోపాటు వార్డు సభ్యులను అభినందించారు. మండలంలోని ఏ పంచాయతీలో జరగనంత అభివృద్ధి కుల్లూరులో జరిగిందన్నారు. ప్రజల సమస్యలను పరిష్కరించేందుకు పార్టీలకు అతీతంగా పార్టీ తరఫున కృషి చేస్తానన్నారు. అనంతరం మాదాసు గంగాధరం అభిమానులు, పార్టీ కార్యకర్తలు కుల్లూరు, వెంకటరెడ్డిపల్లి, రాజుపాళెం గ్రామాల్లోని వార్డు సభ్యులతో కలసి ఇంటింటికి వెళ్లి ప్రజలను కలుసుకొని కృతజ్ఞతలు తెలిపారు.

# విద్యార్థులకు చెడిపోయిన అన్నం!

## వరగలి హాస్టల్ విద్యార్థుల నిరసన

రాత్రి మిగిలిన అన్నాన్ని ప్రక్క రోజు విద్యార్థులకు పెట్టడం, అది పాసిపోయి వాసన వస్తుండడంతో దాన్ని తినేందుకు హాస్టల్ విద్యార్థులు నిరాకరించిన ఘటన చిల్లకూరు మండలం వరగలిలో జరిగింది. ఇక్కడి హాస్టల్‌లో విద్యార్థులకు ప్రభుత్వం నిర్దేశించిన ప్రకారం మెనూ అమలు కావడం లేదని చాలాకాలంగా ఆరోపణలు వస్తున్నాయి. ఇటీవల రాత్రి అన్నం మిగలడంతో దాన్ని మరుసటి రోజు విద్యార్థులకు టిఫిన్‌గా పెట్టబోయారట. అది వాసన వస్తుండడంతో విద్యార్థులు తినకుండా నిరాకరించారు. ఈ వార్త పిల్లల తల్లిదండ్రులకు, స్థానికులకు తెలియడంతో వారు అక్కడకు వెళ్లి హాస్టల్ సిబ్బందిని నిలదీశారు. దీనిపై అధికారులకు ఫిర్యాదు చేస్తున్నామని విద్యార్థులకు నాణ్యమైన ఆహారం ప్రభుత్వ మెనూ ప్రకారం పెట్టాలని డిమాండ్ చేశారు.

# వెంకటాచలం ఎస్ఐ సాహసం!

## దొంగను పట్టుకోబోయి పడి గాయపడ్డాడు

దొంగను పట్టుకోబోయి పట్టు తప్పి ఎస్ఐ గాయాలపాలైన ఘటన వెంకటాచలంలో చోటుచేసుకొంది. స్థానిక ఎస్ఐ సోమయ్యకు విధి నిర్వహణలో మంచి పేరుంది. ఫిర్యాదు అందిన వెంటనే బాధ్యులను పట్టుకోవడం, విచారించడంలో నేర్పుగా వ్యవహరిస్తున్నాడని మండల ప్రజల్లో పేరు సంపాదించుకొన్నాడు. అలాంటి ఎస్ఐని ఒక దొంగ గాయాలపాలయ్యేలా చేయడం చర్చనీయాంశమయ్యింది. వెంకటాచలం రైల్వే స్టేషన్‌లో చాలాకాలంగా ఒక దొంగ తిష్టవేసి దొంగతనాలకు పాల్పడుతున్నాడు. ఆ దొంగ బారినపడిన పలువురు ప్రయాణీకులు పోలీసులకు ఫిర్యాదు చేసివున్నారు. పోలీసులు ఎంతగా నిఘా పెట్టివున్నా దొంగ దొరకకుండా తప్పించుకొని తిరుగుతున్నాడు. ఇటీవల ఆ టక్కరి దొంగ రాత్రివేళ రైల్వే స్టేషన్‌లో తచ్చాడుతున్నట్లు సమాచారం అందుకొన్న ఎస్ఐ ఎలాగైనా అతడ్ని పట్టుకోవాలని అక్కడకు వెళ్లాడు. ఎస్ఐ రాకను గమనించిన దొంగ గోడ దూకి పారిపోయాడు. అతన్ని పట్టుకొనే క్రమంలో ఎస్ఐ సోమయ్య అదుపుతప్పి పడిపోవడంతో గాయాలయ్యాయి.

# బుచ్చిలో మండల పరిషత్ ఎన్నికల వేడి!

పంచాయతీ ఎన్నికలు ముగియడంతో ఊపిరి పీల్చుకొన్న అధికారులు ఇప్పుడు మండల పరిషత్ ఎన్నికలకు సిద్ధమవుతున్నారు. బుచ్చిరెడ్డిపాళెం మండలంలోని ప్రాదేశిక నియోజకవర్గాల జాబితా, ఓటర్లు, జనాభా వివరాలు రూపొందించే పనిలో బిజీగా వున్నారు అధికారులు. దీనిపై ఎమ్పీడిఓ శ్రీహరిరెడ్డి వివరాలు తెలిపారు. మండల పరిధిలో 3500 మంది జనాభాకు ఒక ఎమ్పీటీసి లెక్కన 22 మంది ప్రాదేశిక సభ్యులుంటారన్నారు. బుచ్చి పంచాయతీలో 7, ఇస్కపాళెంలో 3, దామరమడుగులో 2, రేబాలలో 2, వవ్వేరులో 2, చెల్లాయపాళెం, పంచేడు, కట్టుబడిపాళెం, మునులపూడి, జొన్నవాడ, పెనుబల్లి, మినగల్లు, కాగులపాడు పంచాయతీలకు ఒక్కొక్కరు చొప్పున ప్రాదేశిక సభ్యులుంటారని తెలిపారు. ఈ ఎన్నికలకు సంబంధించి ప్రాదేశిక నియోజకవర్గాల జాబితా, ఇతర అంశాలపై అభ్యంతరాల సేకరణ ఆగష్టు 21 వరకు, పరిశీలన 26వ తేదీ వరకు, తుది ప్రచురణ 27న వుంటుందన్నారు.

● ఆత్మకూరు

# అలఘునాథస్వామి ఆలయానికి కళాకాంతులు!



### 17, 18, 19తేదీల్లో విగ్రహ ప్రతిష్ఠాపనోత్సవం

ఆత్మకూరు గ్రామంలో గల అలఘునాథస్వామి ఆలయానికి దశాబ్దాల చరిత్ర వుంది. కొంతకాలం మూతపడి ఐదేళ్ళక్రిందట తెరచిన ఈ ఆలయాన్ని ప్రభుత్వం, దాతల సహకారంతో పునఃనిర్మించారు. సుందరంగా రూపుదిద్దుకొన్న ఈ ఆలయానికి ఆగష్టు 17, 18, 19తేదీల్లో విగ్రహ ప్రతిష్టాపన కార్యక్రమాలు జరుగనున్నాయి. అంగరంగ వైభవంగా ఈ కార్యక్రమాన్ని జరపతలపెట్టారు ఆలయ నిర్వాహకులు. ప్రవచనకర్తగా, ఆధ్యాత్మిక భావాలను పెంపొందిస్తున్న పరిపూర్ణానందస్వామి ఈ విగ్రహ ప్రతిష్టాపనకు రానుండడం విశేషం. అలహాబాద్‌లోని త్రివేణి సంగమం తోపాటు పవిత్రమైన 18 నదుల నుంచి జలాన్ని తెచ్చి ఆ నీటితో అభిషేకం చేయించేందుకు అన్నీ ఏర్పాట్లు చేశారు. 2500 దేవాలయాలలో ప్రతిష్టాపనలు గావించిన మాచవోలు రాజశేఖరశాస్త్రి చేతుల మీదుగా ప్రతిష్టాపన కార్యక్రమం జరగనుంది. ఈ ఆలయాన్ని గతంలో త్రిదండి చినజీయర్‌స్వామి సందర్శించి తన ఆశీస్సులు అందజేసి వున్నారు. దేవాలయ పరిరక్షణ సమితి ఛైర్మన్ కమలానంద భారతీ స్వామి, కాశీ నాయన ఆశ్రమ పెద్దలు శ్రీరామచంద్రారెడ్డి నాయన తదితరులు విచ్చేసి ఆలయ నిర్మాణాన్ని పరిశీలించి నిర్వాహకులను అభినందించారు. ఆలయ పునఃనిర్మాణానికి ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఎంతగానో తోడ్పాటునందించారు. ప్రభుత్వం నుంచి 35లక్షల రూపాయలు మంజూరు చేయించారు. దాతల నుంచి 50లక్షలు, మరొక 15లక్షలతో మొత్తం కోటి రూపాయలతో అలఘునాథ ఆలయాన్ని పునఃనిర్మించడం విశేషం. ఇందుకోసం గ్రామ కమిటీలు ఏర్పాటుచేసి హిందువులతోపాటు ముస్లింల సహకారాన్ని అందుకొన్నారు. ఆలయంలో ప్రతిష్టించే మూలవిరాట్టులు, ఉత్సవ విగ్రహాలు తిరుమల తిరుపతి దేవస్థానం వారు అందజేయడం మరొక విశేషం.



బోగోలు ఈద్గాలో రంజాన్ వేడుకల్లో పాల్గొని సందేశమిస్తున్న బిట్రగుంట ఎస్ఐ నరసింహులు.

# రాజన్న దళం విజయోత్సవం!

### కావలిలో మాత్రం వైకాపానే గెలిపిస్తాం.

మేకపాటి సోదరులతో వైరం సాగిస్తూ రాజన్న దళం పేరిట సొంత కుంపటి పెట్టుకొన్న మెట్టుకూరు చిరంజీవిరెడ్డి బృందం కలిగిరి మండలంలో తమ బలాన్ని చాటింది. మండల పరిధిలో ఏడు సర్పంచ్ స్థానాలను, 6 ఉపసర్పంచులను గెలిపించుకొన్న సందర్భంగా ఇటీవల కావలి పట్టణంలోగల నమస్కార్ హోటల్‌లో విజయోత్సవం నిర్వహించారు. ఈ సందర్భంగా రాజన్న దళం అధిపతి మెట్టుకూరు చిరంజీవిరెడ్డి సంతోషం వ్యక్తం చేశారు. మొదటి నుంచి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మీద అభిమానంతో వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీలో వున్న తమను మేకపాటి సోదరులు కక్ష కట్టి అన్యాయంగా, అక్రమంగా పార్టీ నుంచి దూరం చేశారన్నారు. అయినప్పటికీ రాజశేఖర్‌రెడ్డి మీద అభిమానంతో ఆయన పేరుతోనే రాజన్నదళం ఏర్పాటు చేసి స్థానిక సంస్థల ఎన్నికల్లో పోటీకి నిలిపామన్నారు. అనుకొన్నట్లే అధిక స్థానాలను తమ అభ్యర్థులు విజయం సాధించి రాజన్న దళానికున్న పట్టును తెలియజేశారన్నారు. తాము కలిగిరి మండలంలో రాజన్న దళంగా ఏర్పడి ప్రత్యేకంగా వ్యవహరిస్తున్నప్పటికీ కావలి పట్టణ పరిధిలో మాత్రం వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకే మద్దతునిస్తామని ప్రకటించారు. ఈ విజయోత్సవ సభలో కర్తం శ్రీనివాసుల నాయుడు, గంగినేని రామారావు, రవీంద్ర నాయుడు, వెంకట రమణయ్య తదితరులు పాల్గొన్నారు.

## నంది విగ్రహం చోరీ!

ఉదయగిరి మండలం చెరువుపల్లిలో పురాతన నంది విగ్రహాన్ని దొంగిలించారు. అక్కడి చెరువు గట్టుపై వున్న నంది విగ్రహాన్ని గుప్త నిధుల కోసం త్రవ్వకాలు జరిపే ముఠా నిధి నిక్షేపాల కోసం ఏకంగా విగ్రహాన్ని పెకిలించుకొని వెళ్లుంటారని స్థానికులు అనుమానిస్తున్నారు. దీనిపై పోలీసులకు ఫిర్యాదు చేశారు.

# కావలి హాస్టళ్లు ఘోరం!

● విద్యార్థుల తల్లిదండ్రుల ఆందోళన

కావలి నియోజకవర్గ పరిధిలోగల ప్రభుత్వ హాస్టళ్లలో అపరిశుభ్ర వాతావరణం నెలకొని వుండడం, విద్యార్థులకు అందించే ఆహారం సైతం నాణ్యత లేకుండా వుండడంపై పిల్లలు, వారి తల్లితండ్రులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఇటీవల బీహార్ రాష్ట్రంలో కలుషిత ఆహారం తిని విద్యార్థులు ప్రాణాలు కోల్పోయిన ఘటనను గుర్తు చేసుకొని వారు హడలి పోతున్నారు. పలు హాస్టళ్లలో పారిశుద్ధ్యం అధ్వాన్నంగా వుంటోంది. ఆహారాన్ని తయారుచేసే వంట గదులను పరిశీలిస్తే కడుపులో తిప్పేలా వుంటోంది అక్కడి అపరిశుభ్ర వాతావరణం. ఈగలు ముసురుతుండడం, ఆ ఆహారాన్ని పిల్లలకు పెడుతుండడంతో ఆందోళన వ్యక్తమవుతోంది. హాస్టల్ అధికారులు తూతూమంత్రంగా తనిఖీలు జరపడం తప్ప భోజన పదార్థాలు, వాటి తయారీపై తనిఖీలు జరపక పోతుండడంతో కలుషిత ఆహారమే దిక్కువుతుందని పలువురు వాపోతున్నారు. అలాగే ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజన పథకం అమలవుతున్న తీరుపైనా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. నాణ్యత లేని బియ్యాన్ని నిర్వాహకులకు సరఫరా చేస్తుండడం, పిల్లలకు అందించే భోజన తయారీలో శుభ్రత పాటించక పోతుండడంతో ఎక్కడ కలుషిత ఆహారాన్ని తిని అనారోగ్యానికి గురవుతారో, ప్రాణాల మీదకు వస్తుందోనని భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు ప్రజలు.

# శిథిలావస్థలో నీళ్ల ట్యాంకు!

### బిక్కు బిక్కుమంటున్న సీతారాంపురం ప్రజలు

దాహార్తిని తీర్చేందుకు నిర్మించిన వాటర్ ట్యాంక్ శిథిలావస్థకు చేరుకోవడంతో ఎప్పుడు ప్రమాదం జరుగుతుందోనని భయం భయంగా వుంటున్నారు సీతారాంపురం గ్రామ ప్రజలు. ఈ ప్రాంత ప్రజల మంచినీటి సమస్యను పరిష్కరించేందుకు 25 ఏళ్ల క్రిందట ఓవర్‌హెడ్ ట్యాంకును నిర్మించారు. అది క్రమేణా దెబ్బతిని శిథిలమైపోయింది. పిల్లర్లు దెబ్బతినిపోయి ఇనుప ఊచలు బయటపడడంతో ట్యాంక్ ఎంత ప్రమాదకర పరిస్థితిలో వున్నది చెప్పకనే అర్థమవుతుంది. శిథిలమై కూలిపోయే స్థితికి చేరుకున్న ఈ ట్యాంక్‌తో ప్రజలు భయపడి పోతున్నారు. ఏ క్షణంలో ఉపద్రవం ముంచుకొస్తుందోనని హడలి పోతున్నారు. మరోవైపు పాడుపడిపోయిన ట్యాంక్‌ను శుభ్రపరిచేందుకు ఎవరూ సాహసించక పోవడంతో అపరిశుభ్ర వాతావరణం ఏర్పడి నీళ్లు కలుషితమవుతున్నాయి. పైపులు దెబ్బతినడంతో నీటి సరఫరా సక్రమంగా జరగడం లేదు. దీంతో పేరుకు ట్యాంక్ వున్నా ఉపయోగపడక పోతుండడంతో ప్రజలు మంచి నీటి సమస్యను ఎదుర్కోవలసి వస్తున్నది. ట్యాంక్ ప్రమాదకర పరిస్థితిపై అధికారులకు, ప్రజాప్రతినిధులకు పలుమార్లు విన్నవించుకొన్నప్పటికీ ఫలితం లేకుండా పోయిందని స్థానికులు వాపోతున్నారు.

# బస్సుల రద్దుతో విద్యార్థుల పాట్లు!

ఆర్టీసి అధికారుల అనాలోచిత వైఖరి కారణంగా జిల్లావ్యాప్తంగా పలు ప్రాంతాల విద్యార్థులు అగచాట్లు పడాల్సి వస్తోంది. మండల కేంద్రాలు, వివిధ మారుమూల గ్రామాల నుంచి విద్యార్థులు పాఠశాలలు, కళాశాలలకు వెళ్తుంటారు. వీరంతా బస్సులపై ఆధార పడుతుంటారు. నిర్ణీత సమయానికి బస్సుల్లో వెళ్లే విద్యార్థులు ఇటీవల పలు ప్రాంతాలలో బస్సు సర్వీసులను అధికారులు రద్దు చేయడం, ట్రిప్పులను కుదించ చడంతో సరైన రవాణా సౌకర్యంలేక ఆటోలపై ఆధారపడాల్సి వస్తోంది. కెపాసిటీని మించి ఆటోల్లో ప్రయాణీకులను ఎక్కించుకొంటుండడంతో ప్రమాదాలకు గురౌతున్నారు. అయినా ఆర్టీసి అధికారులు పట్టించుకోక పోతుండడంతో ఇబ్బందులు తప్పడం లేదు. ఇలాంటి సమస్యే వరికుంటపాడు, ఉదయగిరి ప్రాంతాల ప్రజలు ఎదుర్కొంటున్నారు. ఉదయగిరి నుండి గువ్వాడి, వరికుంటపాడు, జడదేవి మీదుగా పామూరు వెళ్లే బస్సు సర్వీసులను నిలిపివేశారు. దీంతో విద్యార్థుల అవస్థలు అన్నీ ఇన్నీ కావు. బోయమడుగు, గువ్వాడి, కాంచెరువు గ్రామాల్లోని 60 మందికి పైగా విద్యార్థులు జడదేవి హైస్కూలుకు వెళ్తుంటారు. బస్సు సర్వీసులను రద్దు చేయడంతో విద్యార్థులు ఆటోలు, జీపుల్లో ప్రయాణించాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ప్రమాదమని తెలిసినా తప్పనిసరై వీటినే ఎక్కాల్సి వస్తోందని పిల్లలు వాపోతున్నారు.

**ఉదయగిరి ఆర్టీసి అధికారులకు తగదు!**

# లారీ ఎక్కిన రైలింజన్!

## బుచ్చిలో వింతగా చూసిన జనం



చికుబుకు చికుబుకు మంటూ పట్టాలపై పరుగులు తీయాల్సిన రైలు కాస్త లారీ ఎక్కడం ప్రజలను ఆశ్చర్యపరచింది. ఈ ఘటన బుచ్చి పట్టణంలో చోటుచేసుకొంది. సాధారణంగా పెద్ద పెద్ద వాహనాలను, ట్రక్కులను తీసుకుని వెళ్తుంటాయి రైళ్లు. దీనికి భిన్నంగా రైలింజన్‌ను ట్రాలీలో తీసుకొని పోవడం ఇటీవల అందరిని సంభ్రమాశ్చర్యాలకు గురి చేసింది.

● గొలగమూడి

# వెంకయ్యస్వామి ఆరాధనోత్సవాలు!

## 18వ తేది ప్రారంభం

గొలగమూడి వెంకయస్వామి ఆరాధనోత్సవాలు ఆగష్టు 18 నుంచి జరగనున్నాయి. రాష్ట్రం నలు మూలల నుంచేకాక ప్రక్క రాష్ట్రాల నుంచి భక్తులు వస్తుండడంతో ఎలాంటి ఇబ్బంది కలుగకుండా వుండేందుకు, తీసుకోవాల్సిన చర్యలపై ఇటీవల ఆశ్రమ కమిటీ సమావేశం నిర్వహించింది. నెల్లూరు ఆర్డీఓ మాధవీలత, ఆలయ కార్య నిర్వహణాధికారి సుబ్రహ్మణ్యం, తహశీల్దార్ శ్రీనివాసులరెడ్డి, ఎమ్పీడిఒ సుగుణమ్మలతో ఉత్సవాల ఏర్పాట్లపై సమీక్షించారు. ఆరాధనోత్సవాలు ముగిసే వరకు ఉచిత వైద్య శిబిరం నిర్వహించాలని, అందుబాటులో వుండాలని ఇస్కపాళెం మెడికల్ ఆఫీసర్ ఉమామహేశ్వరికి సూచించారు. పారిశుధ్యం, త్రాగునీటి విషయంలో ఎలాంటి ఇబ్బంది కలుగకుండా జాగ్రత్తగా వ్యవహరించాలని పంచాయతీ అధికారులకు సూచించారు. ఆలయ పరిసరాల్లో ప్రైవేటు వాహనాలను నియంత్రించాలని బ్రేక్ ఇన్స్‌పెక్టర్ మురళీని ఆర్డీఓ ఆదేశించారు. మద్యం విక్రయాలు జరగకుండా కఠినంగా వ్యవహరించాలని, ఎక్సైజ్ సిబ్బంది ఈ విషయంలో అప్రమత్తంగా వ్యవహరించాలన్నారు. దెబ్బతిన్న రోడ్లకు మరమ్మత్తులు చేయించాలని పంచాయతీరాజ్ అధికారులను ఆదేశించారు. భక్తుల సౌకర్యార్థం ప్రత్యేక బస్సులు నడపాలని ఆర్టీసి అధికారులకు సూచించారు. ఈ సమావేశంలో ప్రత్యేక ఇఒ నాగేశ్వరరావు, పంచాయతీరాజ్ ఏఇ శ్యాం, ఆర్‌డబ్ల్యుఎస్ ఎఇ రమణారెడ్డి, ఆర్‌ఐ పెంచలరెడ్డి, ఆర్టీసి అధికారులు పాల్గొన్నారు.

# యువతకు వివేకానందుడే ఆదర్శం!

● ఆర్ఎస్ఎస్ ప్రాంత ప్రచారక్ భరత్

యువత వివేకానందుని ఆదర్శంగా తీసుకొని ముందుకు నడవాలని సమాజానికి సేవ చేయాలని ఆర్ఎస్ఎస్ ప్రాంత ప్రచారక్ భరత్ పిలుపునిచ్చారు. స్వామి వివేకానంద శతజయంతి ఉత్సవాల సందర్భంగా రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ ఆధ్వర్యంలో ఇందుకూరుపేట ఖండ్ సమావేశం నరుకూరులో జరిగింది. ఈ సందర్భంగా ప్రసంగించిన భరత్ యువతకు సందేశమిచ్చారు. ఇతరుల ఆదర్శాలను ఆచరించడమే కాకుండా స్వీయ ఆదర్శాన్ని పాటించాలన్న వివేకానంద బోధనను అనుసరించాలన్నారు. ఆత్మశక్తిని పెంపొందించుకొని ముందుకు సాగాలని, నిస్వార్థంగా సమాజానికి సేవ చేయాలని పిలుపునిచ్చారు. మన తప్పులను ప్రక్కనవారు చెప్పకుండానే మనకు మనమే సవరించుకోగలగాలన్నారు. ప్రతి ఒక్కరు స్వామి వివేకానంద బోధనలను తెలుసుకోవాలని అందుకోసం ఇంటింటికి వివేకానంద సందేశాన్ని తీసుకొని పోయేందుకు కార్యాచరణను రూపొందిస్తున్నట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో జిల్లా కార్యవాహ్ వెంకటరమణయ్య, విభాగ్ ప్రచారక్ శ్రీనివాసులరెడ్డి, పలువురు స్వయం సేవకులు పాల్గొన్నారు. బుచ్చిరెడ్డి పాళెంలోను ఆర్ఎస్ఎస్ ఈ కార్యక్రమాన్ని చేపట్టింది. స్థానిక శ్రీరామ్‌నగర్‌లో జరిగిన ఇంటింట వివేకానంద కార్యక్రమంలో జిల్లా సంఘ్ చాలక్ బాలు సుబ్బారావు పాల్గొని యువతకు వివేకానందుని గురించి తెలియజెప్పారు. ఈ సందర్భంగా వివేకానందుని చిత్రపటాన్ని, కరపత్రాలను పంపిణీ చేశారు. పట్టణ ప్రముఖులు రాఘవరెడ్డి, కృష్ణారెడ్డి, కేతిరాజు కేశవయ్య, రాజు, సుమంత్, అజయ కుమార్, గిరి, రవితేజ, చంద్రశేఖర్ తదితరులు పాల్గొన్నారు.

# కిలో చేప 94 రూపాయలు!

● చేపల రైతుల సంఘం తీర్మానం.

చేపలకు గిట్టుబాటు ధర కల్పిస్తూ చేపల రైతు సంఘం తీర్మానించింది. కిలో చేపలకు 94 రూపాయలుగా ధర నిర్ణయించింది. చేపల రైతులు ఎదుర్కొంటున్న సమస్యలు, గిట్టుబాటు ధర నిర్ణయంపై ఇందుకూరుపేట మండలం దేవిస్‌పేటలో గల జైన మందిరంలో ఇటీవల సమావేశం జరిగింది. ఈ సందర్భంగా జిల్లా చేపల రైతుల సంఘం అధ్యక్ష, కార్యదర్శులు ఎస్.వి.నాయుడు, రవీంద్రరెడ్డిలు పాల్గొని ప్రసంగించారు. ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి చేపల రైతులు సాగుచేస్తున్నా తగిన గిట్టుబాటు ధర లభించక తీవ్రంగా నష్టపోతున్నారన్నారు. దీనిపై చర్చించిన తర్వాత కిలో చేపలకు 94 రూపాయలను గిట్టుబాటు ధరగా నిర్ణయించామని, ఈ ధరకే రైతుల నుంచి కొనుగోలు చేయాలని వారు ప్రకటించారు. అనంతరం పలువురు రైతులు తాము ఎదుర్కొంటున్న సమస్యలను సమావేశం దృష్టికి తీసుకొని వచ్చారు.











## విలాసాలకు వినూత్న విలాసం...

# మయాన్స్ లగ్జరీ విల్లాస్

### చెన్నైలో ఇ.సి.ఆర్ రహదారి వెంట అసూయరేకెత్తించే గృహ సముదాయం.



మామూలు ఇంటిని ముగ్ధ మనోహరంగా తీర్చి దిద్దడంలో ఇంజనీర్ మరియు ఆర్కిటెక్ట్ మోహన్‌రెడ్డి హస్త వాసి తెలియనివారు నెల్లూరుజిల్లాలో తక్కువ. మోహన్ అసోసియేట్స్ పేరిట గత ముప్పైఐదేళ్లలో మోహన్‌రెడ్డి చేతిలో ఎన్ని భవనాలు భువన మోహనంగా తయారయ్యాయో లెక్కే లేదు. రజనీకాంత్ వంటి కారణ జన్ముడనదగిన కళాకారుడికీ మోహన్ రెడ్డి శిల్ప కళా చాతుర్యం ఎంతో ప్రీతి అంటే, ఆయన ప్రావీణ్యం ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

సాధారణ ఇళ్లకే సౌందర్య సొగసు లద్దగల్గిన శిల్పాచార్యుడు, విలాస ప్రసాదాల నిర్మాణం చేపడితే, అవి ఇంద్ర భవనాలను తలపింప చేస్తాయనడంలో ఆశ్చర్యం ఏమి వుంది?

చెన్నై నగర కాంత కంఠానికి రత్న హారం వలె రూపు దిద్దుకొంటున్న ఇసిఆర్ రహదారిలో మోహన్‌రెడ్డి నిర్మిస్తున్న విలాసవంతమైన విల్లాలు, విలాసాలకే ఒక వినూత్న విలాసంగా మారబోతున్నాయి. ప్రకృతి రమణీయత్వానికి ఆలవాలం – ఇసిఆర్ రోడ్డు. ఆ రోడ్డు ఆనుకొని వున్న మూయాజాల్ ఒక ఆధునిక స్వర్గలోక మందిరం. అలనాటి విశ్వకర్మ నిర్మించిన మయసభను గుర్తుకు తెస్తున్నది. 27 ఎకరాల సువిశాల ప్రాంగణంలో 9ఎకరాల భాగాన్ని ఈ విల్లాలకు కేటాయించారు. పచ్చటి చెట్లు, వాటి రెమ్మలకు విచ్చుకొని కనువిందు చేసే వివిధ వర్ణశోభిత కుసుమాలు, స్వచ్ఛమైన గాలి, ప్రశాంత వాతావరణం, పరచుకొన్న పచ్చిక మైదానాలతో కూడిన ఈ తొమ్మిదెకరాలాను 72 పొదరిళ్ల నిలయంగా మారుస్తున్నారిప్పుడు.

అడుగుతీసి అడుగు పెడితే ప్రపంచంలోని సుఖాలన్నీ అందుబాటులోకి వచ్చే చోట జీవితం గడపాలని కోరుకొనే సంపన్నుల కలలను నిజం చేసే ప్రణాళిక – ఈ విల్లాల నిర్మాణం.

ఇంటి పైకెక్కి చూస్తే సముద్ర కెరటాల కేరింతల సుందర దృశ్యం. ఇంటి నుంచి నాలుగడుగులు నడిస్తే సముద్ర తీరంలో సేదతీరే సువర్ణావకాశం. ఇంటి పక్కనే షాపింగ్ మాళ్లు, సినిమా హాళ్లు, స్విమ్మింగ్ పూల్, ఫుడ్ కోర్టులు, శరీరాన్ని సేదదీర్చే స్పా... ఓహ్... సర్వసౌకర్యాలకూ అదొక కొత్త చిరునామా.




గేటెడ్ కమ్యూనిటీ కాబట్టి ఇరవైనాలుగు గంటలూ కంటికి రెప్పలా కాపాడే భద్రతా వ్యవస్థ. ఆడుకోవడానికి టెన్నిస్ కోర్టు, ప్రాక్టీస్ చేయడానికి క్రికెట్ నెట్, సరదాగా కాలక్షేపానికి టేబుల్ టెన్నిస్, బిలియర్డ్స్. క్లబ్ హౌస్ లోపల హెల్త్ క్లబ్. అందులో జాకుజ్జీ, స్పా, సోన. పూర్తి పైకప్పుతో, వేడినీటి ఈతకోలను, పదిమందితో ఆడి పాడడానికి పార్టీ హాల్... ఇట్లా చెప్పుకొంటూ పోతే క్లబ్ హౌస్‌లో సౌకర్యాలు ఎన్నో... ఎన్నెన్నో...!

ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ గృహసముదాయం ఒక ఆధునిక రిసార్టను తలపిస్తున్నది. ఎప్పుడో తీరిక దొరికినప్పుడు దూర ప్రయాణం చేసి, ఒక పూట నచ్చిన రిసార్ట్‌లో గడిపి రావడమే మనసుకు ఎంతో ప్రశాంతత కల్పిస్తుంది. అటువంటిది, మన ఇంటినే మనసు మెచ్చే రీతిలో రూపొందించుకొన్న స్వంత రిసార్ట్‌లో నిర్మించుకోవడం ఎంత సుందరమైన అనుభూతి? ఆ మధురానుభవాన్ని అందించడమే ఈ మయాన్స్ గేటెడ్ కమ్యూనిటీ లక్ష్యం.

## సౌకర్యాల సమ్మేళనం!

*ఈ లగ్జరీ విల్లాలలో లేని సౌకర్యం అంటూ వుండదు. ప్రాంగణంలోని వీధులలో చల్లని వెన్నెల వంటి వెలుగునిచ్చే ఎల్ఇడి లైట్లు. ప్రతి ఇంటికీ సోలార్ హీటర్. కరెంట్ పోయినా ఇబ్బంది లేకుండా నూటికి నూరు శాతం పవర్ బ్యాకప్. మధురమైన స్నానం అనుభూతి కోసం తీవ్రమైన ఒత్తిడితో ప్రవహించే వేడి, చన్నీళ్ల అమరిక. రక్షణ కోసం నాణ్యమైన నిఘా ఎలక్ట్రానిక్స్ అమరిక. నమ్మకమైన రక్షణ సిబ్బంది పహరా. విల్లా యజమానులందరికీ సౌకర్యం కోసం హౌస్ కీపింగ్ వసతి కల్పించే ఆలోచన కూడా వుంది.*

## MAYANCES CONSTRUCTION & ENGINEERING SERVICES PVT LTD

మన దేశంలో కానీ, విదేశాలలో కానీ జీవితంలో వున్నత స్థానాలకు చేరుకొన్న సంపన్న శ్రేణి ప్రముఖులకు, వారి మనసును రంజింప చేసే నివాస ప్రాంగణాలు నిర్మించి అందించడం ఈ కంపెనీ లక్ష్యం. అంతర్జాతీయ స్థాయి విలాస మందిరాల నిర్మాణమే ఈ కంపెనీ నిర్దేశించుకొన్న ఆశయం. ఆ దిశలో ఒక ముందడుగు మయాన్స్ లక్జరీ విల్లాల రూపకల్పన. రానున్న సంవత్సరాలలో భారతదేశంలో లగ్జరీ రియల్ ఎస్టేట్ రంగంలో అందరికంటే ఒక మెట్టు పైన నిలవాలన్నది ఈ కంపెనీ లక్ష్యం.

ఈ కంపెనీ నిర్వాహకుడు బి.ఉదీప్ రెడ్డి – ప్రపంచస్థాయి ఉత్పాదనలు తీర్చిదిద్దడంలో నైపుణ్యం సాధించిన యువకుడు. అమెరికాలోని కాలిఫోర్నియాలో ఉన్నత విద్య చదవడంతోపాటు అక్కడే ఎంతోకాలం గడిపి, ప్రపంచం మెచ్చే గృహ నిర్మాణం అంటే ఏమిటో అవగాహన చేసుకొని వచ్చాడు. ఆ అనుభవం, ఆ ఉన్నత విద్య మయాన్స్ లగ్జరీ విల్లాల ప్రాజెక్ట్‌కు స్ఫూర్తినిస్తున్నది.



బి.మోహన్‌రెడ్డి
Chairman



బి.ఉదీప్‌రెడ్డి
M.D



బి.సందీప్‌రెడ్డి
C.E.O

## మోహన్ ఆర్కిటెక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్

మన మోహన్‌రెడ్డి గురించి ప్రత్యేకంగా చెప్పుకోవడం అంటే అమ్మ పుట్టింటి ఘనత మేనమామకు చెప్పినట్లే. 35 ఏళ్లుగా వరల్డ్ క్లాస్ భవన నిర్మాణంలో దక్షిణ భారతదేశంలోనే ప్రత్యేత గుర్తింపు పొందింది ఆయన నిర్వహిస్తున్న మోహన్ ఆర్కిటెక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ సంస్థ. సాధారణ ఇళ్ల దగ్గర నుంచి ఆకాశ హార్మ్యాల వరకు, షాపింగ్ కాంప్లెక్స్‌ల నుంచి హైటెక్ ఆస్పత్రుల వరకు, కళ్యాణ మండపాల నుంచి గేటెడ్ కమ్యూనిటీల వరకు మోహన్‌రెడ్డి మేధస్సుతో ప్రాణం పోసుకొన్న నిర్మాణాలెన్నో. ప్రపంచ స్థాయిలో భవన నిర్మాణ రంగంలో వచ్చే మార్పులను ఎప్పటికప్పుడు అర్థం చేసుకొని వాటిని తన ప్రాజెక్టులలో మిళితం చేయడం మోహన్‌రెడ్డి ప్రత్యేకత. అందువల్లనే ఆయన కట్టే ప్రతి భవనం కొత్తగా, వింతగా కన్పిస్తూ వుంటుంది. ఆ సుదీర్ఘ అనుభవాన్ని, సాటి లేని ప్రావీణ్యాన్ని రంగరించి మయాన్స్ లగ్జరీ విల్లా ప్రాజెక్టను తీర్చి దిద్దుతున్నాడు మోహన్‌రెడ్డి.

మోహన్ ఆర్కిటెక్ట్స్ ప్రావీణ్యం చెప్పాల్సిన అవసరం లేదు. హైదరాబాదు, చెన్నై, బెంగుళూరు మహా నగరాలలో వారు నిర్మించిన భవనాలు చూస్తే చాలు. ఒకటా రెండా? ఒక్క హైదరాబాదులోనే గత ఐదేళ్లలో దాదాపు వంద ప్రతిష్టాత్మక ప్రాజెక్ట్‌లు చేసి, నిర్మాణం చేసింది ఈ సంస్థ. వాటిలో ఏ భవనం దగ్గర నిలబడినా చాలు... సొగసు చూడతరమా అన్న గీతం జ్ఞాపకానికి వచ్చేస్తుంది.

## బి.సందీప్‌రెడ్డి

ఈ ప్రాజెక్ట్ నిర్వహణలో కీలక పాత్ర పోషిస్తున్న మరొక యువకుడు బి.సందీప్. అమెరికాలో ఉన్నత విద్య చదివి, ఎన్నో భవన నిర్మాణ ప్రాజెక్టల యాజమాన్యంలో అనుభవం గడించిన యువకుడు.

ఈ ముగ్గురు త్రిమూర్తుల నిర్మాణ సారధ్యంలో రూపుదిద్దుకొంటున్న మయాన్స్ లగ్జరీ విల్లాలు చెన్నై నగరానికి ఒక విలువైన ఆభరణం వలె భాసిస్తాయని చెప్పడంలో సందేహం లేదు. మోహన్‌రెడ్డి స్ఫూర్తితో ఆయన కుమారులు ఉదీప్, సందీప్‌రెడ్డిలు నిర్మాణ, రియల్ ఎస్టేట్ రంగాలలో తమ ప్రావీణ్యంతో వంశకీర్తిని, నెల్లూరు ఖ్యాతిని చాటుతున్నారు.

## ముచ్చటగా మూడు రకాలు!

*మయాన్స్ లగ్జరీ విల్లా గేటెడ్ కమ్యూనిటీ సముదాయంలో ముచ్చటగా మూడు రకాల భవనాలు రూపు దిద్దుకొంటున్నాయి. మొదటిది 'ఏ' టైప్. 45 విల్లాలను 4050 చదరపు అడుగుల స్థలంలో 3700 చదరపు అడుగులలో నిర్మిస్తున్నారు. 'బి' టైప్ విల్లాల సంఖ్య 15. 6750 చదరపు అడుగుల స్థలంలో 4800 చదరపు అడుగల నిర్మాణం వుంటుంది. మూడో రకం విల్లాలు సూపర్ లగ్జరీ తరహాకు చెందినవి 13. 7200 చదరపు అడుగుల విస్తీర్ణంలో 5300 చదరపు అడుగుల కట్టడం జరుగుతుంది.*

*ఇటాలియన్ మార్బుల్ ఫ్లోరింగ్, కోహ్లార్ సిరామిక్ ఉత్పత్తులు, ఇంటి అంతర్భాగంలోనే అందమైన లిఫ్ట్, బాల్కనీలకు వుడన్ డెక్ అలంకరణ వంటి నాణ్యమైన, నాజూకైన, సొగసైన సౌకర్యాలన్నీ అమర్చడం ఇక్కడి ప్రత్యేకత.*













**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

అనవసర ఖర్చులు పెరుగుతాయి. సాహస ప్రయత్నాలు తగ్గించాలి. ఉద్యోగులకు ఈ వారం కాస్త వూరట. రుణ ప్రయత్నాలు కలసి వస్తాయి. గతంలో జరిగిన సమస్యలకు, తగాదాలకు, ఆర్థిక వ్యవహారాలకు రాజీ ప్రయత్నాలు లాభిస్తాయి. కుటుంబ, వ్యక్తిగత, అంతర్గత వ్యవహారాలు సర్దుమణుగుతాయి. అనవసర విషయాలకై అధిక సమయం కేటాయిస్తారు. అనవసర విషయాలలో తలదూర్చ వద్దు.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఈ వారం పరీక్షాకాలంగా వుంటుంది. కుటుంబ వ్యవహారాలలో కలతలు రావచ్చు. కొన్ని జాగ్రత్తలు పాటించాలి. తొందరపడి నూతన నిర్ణయాలు తీసుకోవద్దు. స్పెక్యులేషన్ అనుకూలం కాదు. ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. ముఖ్య నిర్ణయాలలో ఇతరుల జోక్యం వద్దు. నూతన స్త్రీల పరిచయాల వల్ల లాభం కన్నా నష్టమే ఎక్కువ. కళా, క్రీడాకారులు గుర్తింపు పురస్కారాలు అందుకొంటారు.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

అధిక ధన వ్యయం, అనారోగ్య సూచన, పరోపకార భావం కలుగుతాయి. ఈ వారం శత్రువులధికం. అపాత్ర దానం అరిష్టదాయకం. యోగ్యత ఎరిగి దానం చేయడం మంచిది. నిరుద్యోగులకు చక్కని కాలం, ఉద్యోగప్రాప్తి కలుగు కాలం. విద్యార్థులు తమ చదువులపై శ్రద్ధ కలిగి వుంటారు. వ్యవసాయ, కళా, క్రీడాకారులకు అనుకూలం. ఆర్థికాదాయాలుంటాయి. స్పెక్యులేషన్ అనుకూలం కాదు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

సోదర, సోదరీల సంఘీభావం వుంటుంది. మీరు చేసే న్యాయ పోరాటాలు ఆపండి, తద్వారా వాగ్ధోరణి తప్పిపోవును. ఇంటాబయట సమస్యలున్నా స్నేహితుల వల్ల ప్రశాంతంగా వుండగలరు. ఒక ముఖ్య కార్యం నెరవేర్చగలరు. నూతన వాహన కొనుగోలుపై ఆలోచనలు పెడతారు. రుణాలకై వెంపర్లాడుతారు. దైనందిన జీవనానికి భంగం ఏర్పడుట, అధికారుల ఒత్తిడి, ఆందోళనలు వుంటాయి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

శుభకార్యాచరణకు అనుకూలం. ఆర్థికాదాయాలు పెరుగుతాయి. గతంలో ఏర్పడిన కొన్ని చిక్కు సమస్యల నుండి విముక్తి. ప్రశంసలు, ఆర్భాటాలకు పోవద్దు. స్పెక్యులేషన్ అనుకూలం కాదు. సమయస్ఫూర్తి పాటించుట మంచిది. భార్యాభర్తల మధ్య అనుబంధాలు పెరుగుతాయి. కొన్ని విషయాలలో అదుపు అవసరం. అనవసర కోర్కెలు మిమ్ములను వెంటాడుతుంటాయి.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

పుణ్య కార్యాచరణపై ఆసక్తి చూపుతారు. ఇష్యకార్యసిద్ధి. రుణ బాధలు స్వల్పంగా వేధిస్తాయి. మీ వాగ్ధోరణి తగ్గించాలి. కుటుంబ వ్యవహారాలలో శాంతం, కొన్ని విషయాలలో సమన్వయం పాటించాలి. కళా, క్రీడాకారులు తీరికలేని, శ్రమాదులు తమ వృత్తిపై చూపుతారు. వ్యవసాయదారులు ఆర్థిక వనరులకై చేసే ప్రయత్నాలు లాభిస్తాయి. రాజకీయులు పై వర్గాల నుండి తీవ్ర ఒత్తిడి ఎదుర్కొంటారు.

# వారఫలాలు

*తేది 17-8-2013 నుండి 23-8-2013 వరకు మేషంలో కేతువు; మిథునంలో గురువు, కుజుడు 18తేది వరకు తదుపరి కర్కాటకంలో; బుధుడు 20తేది వరకు కర్కాటకంలో తదుపరి సింహంలో; 17తేది నుండి రవి సింహంలో; కన్యలో శుక్రుడు; తులలో శని, రాహువులు; ధనుర్మకర, కుంభ, మీనాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

18తేది దామోదర ద్వాదశి.
19తేది వరాహ జయంతి.
20తేది హయగ్రీవ జయంతి.
21తేది రాఖీ పండుగ, రక్షాబంధనం. శ్రావణ పౌర్ణమి, జంధ్యాల పండుగ.
22తేది శ్రీ రాఘవేంద్రస్వామి ఆరాధన.
24తేది శ్రీ వెంకయస్వామి ఆరాధన.

**శుభ ముహూర్తాలు**

17, 19, 20, 25, 23తేదీలలో వివాహ, గృహ ప్రవేశ, గృహనిర్మాణ ప్రారంభ, అన్నప్రాసనాది శుభ కార్యాలకు సుముహూర్తాలున్నాయి.

**ఆగష్టు తిథులు**

**శ్రావణ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 17 | శని | ఏకాదశి | రా | 08.06 గం.ల.వ |
| 18 | ఆది | ద్వాదశి | సా | 04.56 గం.ల.వ |
| 19 | సోమ | త్రయోదశి | మ | 01.38 గం.ల.వ |
| 20 | మంగళ | చదుర్దశి | ఉ | 10.20 గం.ల.వ |
| 21 | బుధ | పూర్ణిమ | ఉ | 07.13 గం.ల.వ |

**శ్రావణ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| | తదుపరి | పాడ్యమి | తె | 04.26 గం.ల.వ |
| 22 | గురు | విదియ | రా | 02.11 గం.ల.వ |
| 23 | శుక్ర | తదియ | రా | 12.35 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

ఉద్యోగులు విధులలో అధిక మెళకువ, శ్రద్ధ చూపాలి. అన్ని రంగాల వారికి కొన్ని చిక్కులు, చీకాకులు తప్పవు. వృత్తి, వ్యాపార, ఇతర రంగాల వారిని అధికారుల ఒత్తిడి బాధిస్తుంది. వ్యవసాయదారులకు నిరంతర శ్రమ, విద్యార్థులకు విజ్ఞాన లాభం. కళా, క్రీడా రంగాల వారికి తమ వృత్తులలో అధిక శ్రమ వుంటుంది. ఫలితాలు సామాన్యంగా వుంటాయి. బంధు సమాగమంచే లబ్ధి చేకూరుతుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారి ఆదాయం మితమైన ఖర్చులతో ఆర్థికస్థితి మెరుగుపడుతుంది. తలచిన కార్యాలన్నీ నెరవేరుతాయి. కళా, క్రీడా రంగాల వారికి ఆనందం కలిగించే వారం. పురస్కారాలందుకొంటారు. అన్ని రంగాలవారు తమ తమ వృత్తులలో శ్రద్ధ, శ్రమ చూపిస్తారు. అన్నింటా ముందంజ వేస్తారు. విద్యార్థులకు అనుకూలం. భవిష్యత్తు గూర్చిన ఆలోచనలు ఫలిస్తాయి.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

శుభకార్యాచరణకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. స్పెక్యులేషన్ లాభించదు. ఇంట్లో అనవసర ఖర్చులుంటాయి. నూతన అన్వేషణలు లేదా క్రొత్త ఆలోచనలకు ప్రయత్నాలు ప్రారంభిస్తారు. శక్తికిమించిన కార్యాలలో తలదూర్చవద్దు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికాదాయం వుంటుంది. కళా, క్రీడాకారులకు అధికారుల వల్ల కార్యసిద్ధి. రాజకీయులు తమ మాటలు అదుపులో వుంచాలి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

అపరిష్కృత సమస్యలు పరిష్కార దిశగా సాగుతాయి. ఉద్యోగులకు స్థానచలన సూచనలు, విధులలో ఏమరిపాటు పనికిరాదు. మీ పరధ్యానం మిమ్మల్ని చిక్కుల్లో వేయగలదు. కొన్ని విషయాలలో మంకుపట్టి మొండితనం చూపుతారు. మీ సహజ హాస్యచతురతో గడిచిపోతుంది. మిత్రబేధం వల్ల ఖేదం పొందుతారు. అనవసర ఖర్చులు అదుపులో వుంచాలి. అవసరానికి రుణసౌకర్యం లభిస్తుంది.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

అవినీతి కార్యకలాపాలను వ్యతిరేకిస్తారు. పిత్రార్జితాలు, స్థిరాస్తుల విషయాలలో తగుజాగ్రత్తలు అవసరం. గతకొంతకాలంగా వున్న నిస్తేజం, నిరుత్సాహం నుండి బయటపడతారు. మీ కుటుంబ నిర్ణయాలు తొందరపడి ఇతరులతో బహిర్గతం చేయకండి. అవసరానికి అన్యుల ద్వారా సహాయం వుంటుంది. మీలోని భయాలు తొలగుతాయి. కుటుంబంలో అనారోగ్య సమస్యలున్నా పరవాలేదనిపిస్తుంది.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

మీరు వూహించిన విధంగానే కార్యసిద్ధి కలుగుతుంది. ధైర్యంతో అడుగు ముందుకు వేయాలి. వివాదాంశాల జోలికి వెళ్లవద్దు. మీ స్థిరమైన ఆలోచనలే విజయానికి అవకాశం. గృహనిర్మాణ పనులలో ఆటుపోట్లున్నా, ఇంటాబయట ఉల్లాసంగానే వుంటారు. మానసిక ప్రశాంతత కలుగుతుంది. మీ వాక్పటిమ, మంత్రసిద్ధి, కృషి పట్టుదలతో నిర్వహణ. రాజకీయులకు ఉన్నతి.

# దిక్కు భ్రష్టత వల్ల దిగ్భాగ పతనం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*జె.రఘునాధరెడ్డి పాకాల*

** 'త్రివిధ విధానం' అంటే ఏమిటి? దిగ్భాగ పతనాన్ని గురించి చెప్పండి?*

వాస్తు, జ్యోతిషం, గ్రహస్థితి ప్రభావాన్ని త్రివిధానం అంటారు. ఏదో ఒక దిక్కు భ్రష్టత చెందడం దిగ్భాగ పతనం అవుతుంది. ఇందువల్ల గృహస్థు ఆర్థిక, ఆరోగ్య సామాజిక స్థితులు లోపిస్తాయి. సంబంధిత యంత్రప్రతిష్ట వల్ల ఈ దుష్ప్రభావాలు తగ్గుతాయి.

*సి.వి.ఆర్ బాలిరెడ్డిపాళెం*

** వాస్తు దోషాలన్నీ సిద్ధాంతి సరి చేశాడు. అయినా పరిస్థితులేం మారలేదు.*

ఆగ్నేయం వంటగదిలాంటి ప్రాథమిక వాస్తు సూత్రాలే కాదు, నాభి, కమల, పద్మ, కేంద్రీయ స్థానాలు తెలిసిన సిద్ధాంతిని మీరు ఎంపిక చేసుకోవాలి. అందువల్లే పరిస్థితులు మారలేదు.

*టి.ఎన్.శర్మ హైదరాబాద్*

** జ్యోతిషం ఏ వేదంలో వున్నది?*

నాలుగు వేదాలలోనూ జ్యోతిష ప్రస్తావనలున్నాయి. ప్రాచీన కాలంలో జ్యోతిష సమన్వయకర్త 'లగద' మహర్షి. ఇతను జ్యోతిష్యానికి ఆద్యుడు.

*పి.శాంతమ్మ పెనుగొండ*

** ఇంట్లోని చెట్టును తీసివేయవలసి వస్తున్నది. వృక్షవేధో దోషం భయపెడుతున్నది?*

తప్పనిసరి అయినపుడు పదకొండు మొక్కల్ని పెంచగలిగితే మీకు ముప్పు వుండదు. చెట్టును తీసివేస్తున్నపుడు నిర్ధారించబడిన యంత్ర ప్రతిష్ట చేశాక మాత్రమే చెట్టును తీసివేయాలి.

*పి.టి.ఆర్ చెన్నై*

** నేను రాజకీయాలలో రాణిస్తానా? 2014 కలిసి వస్తుందంటున్నారు?*

మీ అన్ని జ్యోతిష శాస్త్ర అంశాలు పరిగణనలోకి తీసుకున్నాక మీకు రాజకీయాలు పనికిరావని తేలుతున్నది. ఇప్పటికి కరిగించిన ఆస్తి చాలు వున్నదన్నా నిలుపుకోండి.

*షేక్ పర్వీన్‌బీబీ కావలి*

** దక్షిణ దిశ గృహ లోపాల వల్ల అతను మరణించాడని నా అభిప్రాయం.*

దక్షిణ యమస్థాన వికృత దోషాల ప్రభావం కొంత వుండే విషయం వాస్తవమే అయినప్పటికీ జ్యోతిష శాస్త్రం ప్రకారం దుష్టగ్రహాల ప్రభావమే అతని మృత్యువుకు కారణం.

*టి.జనకయ్య విడవలూరు*

** కొడవలూరు, విడవలూరు గ్రామాల 'వాస్తుదోషం' అంటారు.*

గ్రామానికి దోషం సంగతి వదిలేయండి. మీ యింటి దోషాల్ని గురించి ఆలోచించండి. నైరుతి, వాయువ్యం, ఈశాన్య దోషాల ప్రభావం 'వ్యక్తులపై వుంటుంది. ఆర్థిక, ఆరోగ్య సమస్యలు పీడిస్తాయి. యంత్రం కోసం సంప్రదించండి.

*టి.వి.కె.శాస్త్రి చెన్నై*

** జాతకాలు రాయడం నేర్చుకోవాలని వుంది. ఏ పుస్తకాలు చదవమంటారు?*

ప్రాథమికంగా మానసారం చదవండి. కొంత జ్ఞానసముపార్జన తర్వాత జాతక మార్తాండం, వరాహమిహిర జాతక పద్ధతులను అధ్యయనం చేయండి.

*టి.రవికులకర్ణి తిరుపతి*

** రత్నధారణ వల్ల ప్రయోజనం వుంటుందా?*

శాస్త్రం రచించింది మహర్షులు. వాళ్లు అనేక ప్రయోగాల తర్వాతే సిద్ధాంతాన్ని ఆవిష్కరిస్తారు. రత్నం వల్ల అనేక గ్రహ, సూక్ష్మ శక్తి దోషాలు నివారణ కావడం నేను స్వయంగా చూశాను.

*షేక్ జబ్బార్ నెల్లూరు*

** ప్లాటు తూర్పు ముఖం కలిగి వున్నది. ఎదురుగా పశ్చిమ గృహం వున్నది. అయినా బాబుకు సమస్యలొస్తున్నాయి.*

గృహాలలో వాస్తు శుభప్రదంగా వుండాలే తప్ప ఫలానా గృహాలు మంచి ఫలితాలనిస్తాయని ఏ శాస్త్రాలూ చెప్పలేదు. తూర్పు గృహ లోపాలు మగపిల్లలపై ప్రభావాలు చూపిస్తాయి.

*సయ్యద్ ముస్తఫా సికింద్రాబాద్*

** ఆలయం సమీపంలో గృహం వెనుక దర్గా వుంది.*

ఆలయం, దర్గా, సమాధులకు సమీపంలో వున్న గృహాలకు 'శక్తివేధ' బాధలుంటాయి. నిర్దేశిత యంత్ర ప్రతిష్ట వల్ల ఈ సమస్యలు కొంత వరకూ తొలగిపోతాయి.

# తూతూమంత్రంగా రెవిన్యూ సదస్సులు!

జిల్లాలో సమైక్యాంధ్ర ఆందోళనల నేపథ్యంలో రెవిన్యూ సదస్సులు తూతూ మంత్రంగా జరుగుతున్నాయి. కానీ అధికారులు మాత్రం ఈ సదస్సులు గొప్పగా జరుగుతున్నాయని బీరాలు పలుకుతున్నారు.

జిల్లాలో రెవిన్యూ సదస్సులు నామమాత్రంగా జరుగుతున్నాయి. రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా సమైక్యాంధ్ర ఆందోళనల నేపథ్యంలో అధికారులు గ్రామాలకు సక్రమంగా వెళ్లడం లేదు. ఎంతో ప్రతిష్టాత్మకంగా రెవిన్యూ సదస్సులు నిర్వహించాలన్న ప్రభుత్వ లక్ష్యం నెరవేరకుండాపోయే అవకాశం ఏర్పడింది. గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలు ఎదుర్కొంటున్న భూ సమస్యలు, భూ వివాదాలను ఈ సదస్సుల ద్వారా పరిష్కరించాల్సి వుంటుంది. అయితే రెవిన్యూ అధికారులు గ్రామాలకు వెళ్లి సదస్సులు ఏర్పాటు చేయకుండానే ఏర్పాటు చేసినట్లు రికార్డుల్లో నమోదు చేసేస్తున్నారు. రెవిన్యూ సదస్సుల నిర్వహణపై ఆకస్మిక పరిశీలన చేయాల్సిన జిల్లా అధికారులు ఆ దిశగా దృష్టి సారించడం లేదు. పర్యవేక్షణ లేకపోవడంతో మండలస్థాయిలో అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారన్న ఆరోపణలున్నాయి.

రెవిన్యూ సదస్సుల నిర్వహణకు తహశీల్దార్, ఆర్ఐ, సర్వేయర్, విఆర్వోలు తప్పనిసరిగా హాజరు కావాలన్న నిబంధన వుంది. వీరంతా ఒక బృందంగా ఏర్పడి మండలంలో రెవిన్యూ సదస్సులు ఏర్పాటు చేయాలి. ఏ గ్రామంలో సదస్సు నిర్వహిస్తారో ముందుగా ఆయా గ్రామాల ప్రజలకు తెలియజేయాలి. సదస్సు నిర్వహించే గ్రామానికి సంబంధించి గతంలో స్వీకరించిన వినతి పత్రాలు పెండింగ్‌లో వుంటే వాటిని వెంట తీసుకెళ్లి గ్రామస్తులు, రైతుల సమక్షంలో పరిష్కరించేందుకు కృషి చేయాలి. గతంలో సమర్పించిన వినతి పత్రాల గురించి అసలు పట్టించుకోవడం లేదు. గ్రామాల్లో ప్రధానంగా భూ వివాదాల్లో స్మశానాల ఏర్పాటు, పట్టాదారు పాసుపుస్తకాల జారీ, ప్రభుత్వం పంపిణీ చేసిన భూములకు సరిహద్దులు చూపించడం వంటి సమస్యలు వున్నాయి. ఈ సమస్యలపై ప్రజలు రెవిన్యూ కార్యాలయాల చుట్టూ తిరిగి వినతి పత్రాలు అందజేసి వున్నారు. రెవిన్యూ సదస్సుల్లోనైనా భూ సమస్యలు పరిష్కారం అవుతాయని భావించిన వారికి నిరాశే మిగిలింది.

ప్రతి సోమవారం జిల్లా కేంద్రంలో కలెక్టర్, ఎస్పీలు నిర్వహించే ప్రజావిజ్ఞప్తుల దినంలో భూ సమస్యలపై అధిక సంఖ్యలో వినతి పత్రాలు అందుతుంటాయి. వీటిని పరిష్కరించాలని సంబంధిత తహశీల్దార్లకు పంపుతున్నా మండలస్థాయిలో వీటి గురించి పట్టించుకునే దిక్కు లేకుండా పోయింది. ఇటీవల కొత్త కలెక్టర్‌గా బాధ్యతలు స్వీకరించిన శ్రీకాంత్ భూ సమస్యలపై ప్రత్యేక దృష్టి సారించి పెండింగ్‌లో వున్న దరఖాస్తులను త్వరితగతిన పరిష్కరించాలని అధికారులను ఆదేశించడం జరిగింది. జిల్లావ్యాప్తంగా రెవిన్యూ సదస్సులు నిర్వహిస్తుండడంతో రెవిన్యూ పరంగా అన్నింటికి పరిష్కార మార్గం చూపాల్సి వుంది. భూమి హక్కులకు సంబంధించి రైతులకు అందించే పట్టాదారు పాసుపుస్తకాలు కంప్యూటరీకరణ ద్వారా అందజేసే విధానానికి శ్రీకారం చుట్టారు గ్రామస్థాయిలో విఆర్వోలు వీటి జారీకి లంచాలు డిమాండ్ చేస్తూ రైతుల్ని ఇబ్బంది పెడుతున్నారు.

అన్ని గ్రామాలకు సంబంధించిన భూముల వివరాలను కంప్యూటరీకరణ చేయాలని గత సంవత్సరం నుంచి జిల్లా కలెక్టర్లు ఆదేశిస్తున్నా మండల స్థాయిలో కంప్యూటరీకరణ జరగడం లేదు. ఏదైనా అవసరం ఏర్పడినప్పుడు భూముల రికార్డులు తీసుకోవాలంటే తీవ్ర జాప్యం జరుగుతోంది. ప్రతి ధృవీకరణ పత్రానికి మీ–సేవను ఆశ్రయించాల్సి వస్తుంది. రోజుల తరబడి కార్యాలయం చుట్టూ త్రిప్పుకుని రికార్డులు అందుబాటులో లేవన్న సమాధానం చెబుతుంటారు. దీంతో విసుగు చెందిన వీరు మళ్లీ రెవిన్యూ అధికారులను కలసి విన్నవించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ఈ దఫా నిర్వహిస్తున్న రెవిన్యూ సదస్సులు ప్రజలకు చేరువకాలేక పోయాయన్నది వాస్తవం. అధికారులు మాత్రం ఈ సదస్సుల గురించి గొప్పగా ప్రచారం చేసుకోవడంపై ప్రజలు ఆశ్చర్యం వ్యక్తపరుస్తున్నారు.



పేరుకే సర్వే!

# పారదర్శకంగా చేయని పేదరిక నిర్మూలనపై సర్వే!

జిల్లాలో పేదరిక నిర్మూలనపై ఇంటింటా రెండవ విడత సర్వేకు శ్రీకారం చుట్టారు. కానీ ఈ సర్వే పారదర్శకంగా నిర్వహించకపోవడం విమర్శకు తావిస్తుంది.

జిల్లాలో రెండవ విడత పేదరిక నిర్మూలన ఇంటింటా సర్వేకు శ్రీకారం చుట్టారు. జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ఆధ్వర్యంలో గ్రామీణ ప్రాంతాల్లో ఈ కార్యక్రమం జరుగుతుంది. డిఆర్‌డిఏ – ఇందిర క్రాంతి పథం సిబ్బంది ఇంటింటా సర్వే చేస్తున్నారు. గత సంవత్సరం తొలిసారిగా పేదరిక నిర్మూలనపై సర్వే జరిపారు. సర్వే సిబ్బందికి 18 అంశాలతో కూడిన నమూనాను అందజేసి కుటుంబసభ్యుల వివరాలను సేకరించాలని సూచించారు. సర్వే సిబ్బందికి ఒక కంప్యూటర్ ఆపరేటర్‌ను ఏర్పాటుచేసి ఆన్‌లైన్ ద్వారా జిల్లా కేంద్రానికి ఏ రోజు సమాచారాన్ని ఆ రోజు చేరవేసే విధంగా ఏర్పాట్లు చేశారు.

అన్ని మండలాల్లో ఇంటింటా సర్వే కార్యక్రమం నిర్వహించాలని అధికారులు ఆదేశించినా కొన్ని మండలాల్లో ఇంకా ప్రారంభం కాలేదు. ఈ నెలాఖరు లోగా సర్వే పూర్తి చేయాల్సి వున్నప్పటికీ ఇందిర క్రాంతి పథం సిబ్బంది పెద్దగా స్పందించడం లేదు. తొలి దఫా నిర్వహించిన పేదరిక నిర్మూలన సర్వేలో అనేక లోటుపాట్లు జరిగాయి. సర్వే కార్యక్రమాన్ని అంగన్‌వాడీ వర్కర్లకు అప్పగించారు. వీరికి ముందుగా సర్వేపై ఎటువంటి శిక్షణ ఇవ్వకపోవడం వలన కుటుంబసభ్యుల పూర్తి వివరాలు సేకరించలేక పోయారు. రాష్ట్రస్థాయిలో సర్వేపై పరిశీలన చేయడంతో లోటుపాట్లు బహిర్గతమైనాయి. మళ్లీ రీ సర్వే చేయాలని జిల్లాకు ఆదేశాలందాయి. మండల తహశీల్దార్ కార్యాలయాల్లో విధులు నిర్వహించే సహాయ గణాంక అధికారులు రీ సర్వే చేయాలని ఆదేశించినా తూతూ మంత్రంగా ముగించారు.

పేదరిక నిర్మూలన కోసం క్షేత్రస్థాయిలో సర్వే నిర్వహించి వివరాలు పంపితే వీటి ఆధారంగా కేంద్రం నుండి నిధులు విడుదల అవుతాయి. సక్రమంగా వివరాలు సేకరించలేకపోతే గ్రామీణ ప్రాంతాల ప్రజలు నష్టపోయే అవకాశం వుంది. పేద ప్రజల అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని జాగ్రత్తగా సర్వే చేయాల్సి వుంటుంది. తొలి దఫా అంగన్‌వాడీ వర్కర్ల ద్వారా సర్వే చేయించిన కారణంగా లోపాలు చోటుచేసుకోవడంతో ఈ దఫా ఐకెపి సిబ్బంది ద్వారా సర్వే చేయిస్తున్నారు. కుటుంబ యజమాని పేరుతోపాటు సభ్యుల వివరాలు, వృత్తి, విద్యార్హతలు, ద్విచక్ర వాహనం, సెల్‌ఫోన్, టీవీ, ఫ్రిజ్, భూముల వివరాలు, పక్కా ఇల్లు వుందా? లేదా? ప్రస్తుత ఆర్థిక పరిస్థితి తదితర అంశాలపై సమాచారాన్ని నమోదు చేయనున్నారు.



సర్వే చేస్తున్న నెల్లూరులోని డిఆర్‌డిఏ కార్యాలయం.

కొన్ని గ్రామ పంచాయితీల పరిధిలో ఇంటింటికి వెళ్లకుండానే ఒక ప్రాంతంలో కూర్చొని పొదుపు మహిళల ద్వారా గ్రామంలోని వారి పేర్లను నమోదు చేసుకుంటున్నారు. ఇలా చేయడం వలన పూర్తి సమాచారం అందకుండా పోతుంది. ఆగష్టు నెలాఖరుకు సర్వే పూర్తి చేయాలని భావించిన అధికారులు పర్యవేక్షణ చేయడంలో వైఫల్యం చెందారు. సర్వే కార్యక్రమాన్ని పర్యవేక్షణ చేసే వారు లేకపోవడంతో సిబ్బంది తప్పులతడికలుగా వివరాలు నమోదు చేస్తున్నారు. ఇప్పటికైనా డిఆర్‌డిఏ అధికారులు స్పందించి పేదరిక నిర్మూలన కోసం జరిగే ఇంటింటా సర్వే కార్యక్రమాన్ని పారదర్శకంగా నిర్వహించే విధంగా చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది. లేకుంటే భవిష్యత్తులో అనేక ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వుంటుంది. ప్రభుత్వ పరంగా ఏ సర్వేలు కూడా సమర్థవంతంగా నిర్వహించడం లేదు. కాకి లెక్కలతో సరిపుచ్చడంతో సర్వే నివేదికల్లో వాస్తవ వివరాలు వుండక లేనిపోని సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి.

# ట్రైంపాస్ చెన్నై ఎక్స్‌ప్రెస్!



అల్లూరు రహీం

ఈ మధ్య హిందీలో దక్షిణాదిలో హిట్ అయిన పలు చిత్రాలను రీమేక్‌చేసి విజయాలు సాధిస్తున్నారు. సల్మాన్‌ఖాన్, అక్షయ్‌కుమార్, అమీర్‌ఖాన్‌లు ఈ బాట సాగుతుండడంతో బాలీవుడ్ బాద్‌షా షారూఖ్‌ఖాన్‌కు కూడా ఉరఉరలాడినట్లుంది. విజయం కోసం పరితపిస్తున్న ఆయన దర్శకుడు రోహిత్ శెట్టిని పురికొల్పి మాస్ మసాల కథ చెన్నై ఎక్స్‌ప్రెస్‌ను రూపుదిద్దించాడు. ఈ సినిమా చూస్తుంటే తెలుగులోని మర్యాద రామన్నలోని ట్రైన్ ఎపిసోడ్ దృశ్యాలు, ఒక్కడులో విలన్ పసుపు నీళ్ల స్నానం, రాజన్నలో చిన్న పిల్లవాని తిరుగుబాటు, సై, మిర్చి చిత్రాలతోపాటు తమిళ సింగంలోని పలు సన్నివేశాలను కథకుడు సుబాష్ నిరభ్యంతరంగా వాడేశాడని అవగతమవుతుంది. అయినా కథలో కొత్తదనం లేదు. యూనస్ సజావాల్ వ్రాసిన స్క్రీన్‌ప్లేలో చురుకుదనం లేదు. దీనివల్లే షారూఖ్‌ఖాన్ ప్రేమికుని పాత్రలో ప్రేక్షకులను మెప్పించను తెగ కష్టపడ్డాడు. కథ డిమాండ్ చేయకపోవడంతో హీరోయిన్ దీపికా పదుకొనేకు గ్లామర్ మెరుపులు లేవు. ప్రియమణి 1, 2, 3 అంటూ నర్తించిన ఐటమ్‌పాట ప్రేక్షకులను ఆకర్షించలేదు. వాస్తవానికి విశాల్ – శేఖర్ సంగీతం కూర్చిన పాటల్లో రజనీకాంత్‌ను కీర్తిస్తూ చిత్రం చివరన ఉన్న 'తలైవా' పాట మినహా మరోపాట బాగలేదు. అందగత్తె దీపికా పదుకొనేకు పట్టుచీర కట్టడం, లవర్‌బాయ్ షారూఖ్‌ఖాన్‌కు పంచె కట్టి, దానిపై బూట్లువేసి స్టెప్పులు వేయించిన పాటల్లో ఆయన జోకర్‌ను గుర్తుకు తెస్తారు. అయితే ఈ చిత్రంలో గొప్పగా చెప్పుకోవాల్సింది దూడ్లే ఫోటోగ్రఫీ. లోనావాలా, రామేశ్వరం ప్రకృతి అందాలను, చెన్నై ఎక్స్‌ప్రెస్ కదలి వెళ్లే దృశ్యాలను తనదైనశైలిలో అందంగా తెరపై చూపాడు. తమిళంలో సాగే మాటలకు సబ్ టైటిల్స్ వేయకపోవడం తెలుగు ప్రేక్షకులను ఇబ్బంది పెట్టకపోయినా హిందీ ప్రేక్షకులను ఇబ్బంది పెట్టి ఉంటుంది. కళ్లలో ప్రేమ కురిపిస్తుంది, మొబైల్ ఫోన్లు వచ్చాక పెళ్లాం ఫోను నెంబరు గుర్తురాదు. ప్రేమ గొప్ప భాష, జీవితంలో ఒకటే పరుగెడుతుంటాం, కానీ ఒక్కసారి ఆగిపోతాం, ఆడదాన్ని గూర్చి తెలుసుకోవడం కష్టం డైలాగులు ఆలోచింపజేస్తాయి. చాలా చోట్ల తెలుగు, తమిళ, హిందీ మిక్సింగ్ డైలాగులు రెడీ స్టడీ పో, మేరీ అమ్మా నహీహై వంటివి వున్నాయి.




చిత్ర కథలోనికివెళ్తే ముంబాయిలో హల్వా వ్యాపారం చేసే కుటుంబీకుడు రాహుల్(షారూఖ్‌ఖాన్)ను ఆయన తల్లితండ్రులు చనిపోవడంతో తాత పెంచి పెద్ద చేస్తాడు. తాతకు క్రికెటర్ సచిన్ టెండూల్కర్ అంటే వల్లమాలిన అభిమానం. ఆయన నూరవ జన్మదినోత్సవం రోజు సచిన్ 99 పరుగులకు ఔట్ కావడం భరించలేక గుండెపోటుతో ప్రాణాలు విడుస్తాడు. తాత కోరిక మేరకు అస్థికలను రామేశ్వరంలోని సముద్ర జలాల్లో కలపను రాహుల్ చెన్నై ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరుతాడు. ఈ రైలులో ఎక్కే మీనమ్మ(దీపికా పదుకొనే) తాను ఇబ్బందుల్లో ఉన్నానని అంత్యాక్షరి పాట రూపంలో రాహుల్‌కు చెబుతుంది. తన తండ్రి దుర్గేశ్వర అళగు సుందరం(సత్యరాజ్) తమిళనాడులోని కంభన్ ప్రాంతంలో డాన్ అని మరో డాన్ తంగబలి(నికితిన్ ధీర్)కి ఇచ్చి పెళ్లి చేయ తలపెట్టగా తప్పించుకొని వచ్చానంటుంది. ఆమెతో వచ్చిన రౌడీలతో సహా రైలులో కంభన్ దిగిన మీనమ్మ, రాహుల్ తన ప్రేమికుడని ఇంట్లో వాళ్లకు చెబుతుంది. రాహుల్ తనను మీనమ్మ బుక్ చేసిందని తెలుసుకొంటాడు. కాస్త కెమిస్ట్రీ జరిగాక మీనమ్మను రాహుల్ ఇష్టపడతాడు. మీనమ్మ తండ్రిని, ఆమెను పెళ్లి చేసుకోవాలనుకొన్న తంగబలితో రాహుల్ పోరాడి గెల్చి ఆమెను తనదాన్ని చేసుకోవడంతో సినిమా ముగుస్తుంది. ఈ సినిమాలో షారూఖ్ వయసు పైబడినట్లు బాగా కనిపిస్తాడు. టైంపాస్‌కు చెన్నై ఎక్స్‌ప్రెస్‌కు వెళ్లొచ్చు.

## ప్రేక్షకులను మెప్పించాలి!

ఒకప్పుడు అవకాశాల కోసం ఎన్నో ఇబ్బందులు పడింది హీరోయిన్ కత్రినా కైఫ్. ప్రస్తుతం ఒక్కపాట, ఒకే ఒక్కపాట. రెండు రోజులు మీరు కాల్షీట్లు ఇస్తే చాలు. మా సినిమా స్థాయి పెరుగుతుందంటూ దర్శక, నిర్మాతలు ఆమె చుట్టూ తిరిగే రోజులొచ్చాయి. ప్రస్తుతం బ్యాంగ్ బ్యాంగ్, ధూమ్–3 చిత్రాల్లో నటిస్తున్న కత్రినా ఇటీవల హైదరాబాద్ వచ్చింది. పిచ్చాపాటీగా మాట్లాడుతూ ఓ హీరోయిన్ అందంగా, ఆరడుగుల ఎత్తు ఉందంటే లాభం లేదు. ఆ అందం ప్రేక్షకులను మెప్పించాలి. వాళ్ల అభిరుచికి తగ్గట్టుగా కథానాయిక తెరపై కనిపించాలి. అప్పుడే విజయాలు దక్కుతాయి. ప్రేక్షకుల అభిరుచులకు అనుగుణంగా నేను నా అందానికి మెరుగులు దిద్దుకొంటూ ఉంటాను. ధూమ్–3లో పాత్ర కోసం నేను ప్రత్యేకంగా సన్నద్ధమయ్యాను. ఇలాంటి ధారుఢ్యం ఆ పాత్ర డిమాండ్ చేసింది. అందుకే కష్టపడి మారాను. ఇలా మారడం స్వతహాగా నాక్కూడా బాగా నచ్చింది. ఎప్పటికీ ఇదే ఆకృతిని కొనసాగించాలనుకొంటున్నానంది.

## సిక్స్‌ప్యాక్ అనుష్క!



సినిమా కోసం కష్టపడడంలో హీరోలకు ఏమాత్రం తీసిపోనంటోంది అనుష్క. రుద్రమదేవి, బాహుబలి చిత్రాలు పూర్తవ్వగానే సిక్స్‌ప్యాక్ సిద్ధం చేస్తానంది. ఈ రెండు చిత్రాల కోసం తన బరువును తగ్గించుకొని ప్రత్యేకంగా మరింత నాజూగ్గా తయారయ్యింది. ఇప్పుడు కనిపిస్తున్న విధానం ఆమెకు బాగా నచ్చిందట. ఇకపై కూడా ఇలాగే స్లిమ్‌గా కనిపిస్తానని చెబుతోంది. సిక్స్‌ప్యాక్ దేహంతో కనిపించాలనే కోరిక కూడా అనుష్కకు ఎప్పట్నుంచో ఉందట. ఆ ముచ్చట కూడా ఇప్పుడే తీర్చుకొంటానని పట్టుబడిందట. మధ్యలో రాజమౌళి అడ్డు తగిలి వారించాడట. ఇప్పుడు చేస్తున్న సినిమాలు పూర్తవ్వగానే సిక్స్‌ప్యాక్‌లో కనిపిస్తానంటుంది.

## ఇష్టమొచ్చినట్లు రాయండి!

పుకార్లు పుట్టించవద్దనే హీరోయిన్లను చూశాం. కానీ లక్ష్మీరాయ్ మాత్రం పుకార్లే కదా పర్లేదు అంటోంది. పాత్రికేయులు నాకు ఫ్రెండ్స్. నా గూర్చి ఏమైనా రాసుకొనే స్వేచ్ఛ వాళ్లకు ఇస్తున్నానంటోంది. ఇటీవల బలుపు చిత్రంలో రవితేజతో కలసి ఆడిపాడింది. ఏమాత్రం మొహమాటం లేకుండా అందాలు ఆరబోసింది. హీరోయిన్లపై పుకార్లు ఎక్కువగా వస్తుంటాయి కదా? మీకు అనుభవాలేమైనా ఉన్నాయా? అని అడిగితే నా గూర్చి ఏమైనా వ్రాసుకోవచ్చు. రాయకపోతేనే నేను ఫీల్ అవుతానని సెలవిచ్చింది.

## ఐటెమ్ అదురునా?



హీరోయిన్‌గా అవకాశాలు సన్నగిల్లితే ఐటమ్‌భామ పోస్టు ఆహ్వానం పలుకుతుంది. ఇప్పుడు సోనియా అగర్వాల్ విషయంలోనూ ఇదే నిజమయ్యింది. 7/జి బృందావన కాలనీ సినిమాలో ఆకట్టుకొంది ఈ భామ. దర్శకుడు శ్రీరాఘవతో ఈమె పెళ్లి పెటాకులయ్యింది. దీంతో మళ్లీ సినిమాలపై దృష్టి పెట్టింది సోనియా. అయితే హీరోయిన్ ఛాన్సులు రావడం లేదు. దీంతో అమ్మా నాన్న ఊరెళితే సినిమాలో ఓ పబ్ పాటలో సోనియా చిందులు వేసింది. ఈ ఐటెం అదిరితే సోనియాకు మరిన్ని అవకాశాలు రావడం ఖాయం.

## హృదయమున్న సోదరులు



పరిశ్రమలో ఓ మంచి సాంప్రదాయానికి తెర తీశారు సూర్య, కార్తీ సోదరులు. తాము నటించిన సినిమా పూర్తవ్వగానే ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోకుండా... చిత్ర బృందాన్ని అంతా ఒక చోటుకు పిలిచి ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెబుతున్నారు. విందు ఏర్పాటు చేసి కాసేపు సరదాగా గడుపుతున్నారు. సింగం–2 సినిమా కోసం కష్టపడిన ప్రతి సాంకేతిక నిపుణుడినీ తన ఇంటికి పిలిచి విందు ఇచ్చాడు సూర్య. తమ్ముడు కార్తీ కూడా అన్న బాటలో నడిచాడు. తాను నటించిన బిర్యానీ చిత్రం పూర్తవ్వగానే లైట్‌మెన్‌ల దగ్గర్నుంచి కారు డ్రైవర్ల వరకు అందరినీ పిలిచి విందు ఇచ్చాడు. ఉడతాభక్తిగా చెరో పదివేల నగదు ఇచ్చి పంపాడు. సినిమా కోసం పనిచేసిన వాళ్లను గుర్తుంచుకోవడం మంచి పరిణామమని అందరూ అంటున్నారు.

# సమైక్యాంధ్ర ఉద్యమంలో వినూత్న నిరసనలు!

## ● రోడ్డుపై వంటావార్పు, క్రికెట్, కబడ్డీ ఆడుతున్నారు

సమైక్యాంధ్ర ఉద్యమం జిల్లాలో ఊపందుకొంది. ఎక్కడికక్కడ ఆయా ప్రాంతాల్లో ప్రజలు, ముఖ్యంగా యువకులు ముందుకొచ్చి వినూత్న రీతుల్లో నిరసనలు తెలుపుతుండడంతో సమైక్యాంధ్ర నినాదం మారుమ్రోగి పోతుంది. ఈ ఉద్యమం పుణ్యమా అని రహదారులు రూపురేఖలు మారిపోతున్నాయి. కొన్ని చోట్ల రోడ్లే వంట గదులవుతుంటే, మరి కొన్నిచోట్ల రహదారులు క్రీడామైదానాలుగా మారుతుండడం విశేషం. పలు రాజకీయ పార్టీలు, విద్యార్థి సంఘాల ఆధ్వర్యంలో రోడ్లపై, ప్రజాప్రతినిధుల ఇళ్ల ఎదుట వంటావార్పు చేస్తూ అక్కడే సామూహిక భోజనాలు చేస్తుండడంతో రోడ్లు కాస్త వంట శాలలుగా మారాయి. మరికొన్ని చోట్ల వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో రోడ్లపై క్రికెట్ ఆడుతుండడం, ఉద్యోగులు కబడ్డీ ఆడుతుండడంతో రోడ్లు వివిధ క్రీడలకు మైదానాలుగా రూపాంతరం చెందుతుండడాన్ని ప్రజలు చర్చించుకొంటున్నారు.



**వంటావార్పులో వైఎస్‌ఆర్ కాంగ్రెస్ నాయకులు.**

జరుగుతున్న సమైక్యాంధ్ర ఉద్యమ ఫలితం ఎట్లా వుంటుందో తెలియకపోయినా విద్యార్థుల చదువులు అటకెక్కాయి. పలువురికి ఈ ఉద్యమ వాతావరణం మంచి కాలక్షేపంగా మారింది.

# అటు రంజాన్... ఇటు శ్రావణ శుక్రవారం!

## ఘనంగా జరుపుకొన్న హిందూ, ముస్లిం సోదరులు



**రంజాన్ ప్రార్థనల్లో ముస్లిం సోదరులు.**

రంజాన్ పండుగ ముస్లింలందరికీ ఎంతో ప్రాధాన్యత గల పండుగ. మరోవైపు శ్రావణ మాసంలో మొదటి శుక్రవారం కావడంతో శ్రావణ శుక్రవారంగా భావించి హిందువులందరూ భక్తిశ్రద్ధలతో జరుపుకొనే పండుగ. అటు హిందువులు, ఇటు ముస్లింలకు సంబంధించి రెండు ముఖ్యమైన పండుగలు ఒకేరోజు, అందులోను శుక్రవారమే రావడంతో నగరంలో కోలాహలం నెలకొనింది. పొద్దునే మహాలక్ష్మీ అమ్మవారి దర్శనానికి భక్తులు ఆలయాల్లో బారులు తీరారు. అటు ముస్లింలు ప్రత్యేక ప్రార్థనల కోసం ఈద్గాలకు వెళ్లారు. ఒకవైపు అమ్మవారి ప్రత్యేక పూజలతో మందిరాలు కిటకిటలాడగా, మరోవైపు ముస్లింలు నమాజు చేసేందుకు రావడంతో మసీదుల్లో కోలాహలం నెలకొనింది. ఒకరికొకరు రంజాన్ శుభాకాంక్షలు చెప్పుకొంటూ మహమ్మదీయులందరూ సంతోషంగా రంజాన్ పండుగను జరుపుకోగా, సౌభాగ్యం ప్రాప్తించాలని, లక్ష్మీకృప వుండాలని, సుఖసంతోషాలతో కుటుంబం తులతూగాలని హిందువులు ముఖ్యంగా మహిళలు అమ్మవారిని ప్రార్థించేందుకు ఆలయాల్లో బారులు తీరారు. ఇలా ఇరు మతాలకు చెందిన వారికి ఒకేరోజు, అందులోను శుక్రవారం నాడు ప్రాధాన్యతగల పండుగలు రావడంతో నగరం ప్రత్యేకతను సంతరించుకొంది.

# సాంఘిక సంక్షేమ శాఖలో అవినీతి, అక్రమాలు!

## జాయింట్ డైరెక్టర్ రఘురాం నిర్ధారణ

అవినీతి, అక్రమాలకు నిలయంగా మారిన సాంఘిక సంక్షేమ శాఖ జిల్లా కార్యాలయంలో జాయింట్ డైరక్టర్ రఘురాం విచారణ నిర్వహించారు. ఇటీవల నెల్లూరుకు విచ్చేసిన ఆయన ఆ శాఖాధికారులు, సిబ్బందిని వివిధ అంశాలపై విచారించారు. ఉపకార వేతనాలు, సిబ్బంది బదలీలు, సంఘ బంధం ద్వారా నాల్గవ తరగతి ఉద్యోగుల నియామకాలు, ప్రభుత్వానికి అధికంగా ఫిర్యాదులు అందాయి. వీటిపై స్పందించిన ఆ శాఖ ఉన్నతాధికారులు జాయింట్ డైరక్టర్ రఘురాంను విచారణ చేయమని ఆదేశించారు. కార్యాలయంలోని అన్ని విభాగాలకు చెందిన ఫైళ్లను సమగ్రంగా పరిశీలించడం జరిగింది. ప్రధానంగా ఉపకార వేతనాల మంజూరులో కార్పొరేట్ కళాశాలలకు అనుకూలంగా కార్యాలయ సిబ్బంది వ్యవహరిస్తూ మామూళ్లు తీసుకుంటున్నారన్న ఆరోపణలున్నాయి. ప్రభుత్వ, ఎయిడెడ్ కళాశాలలో చదివే విద్యార్థులకు ఉపకార వేతనాలు మంజూరు చేయడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారన్న విమర్శలు వున్నాయి. సాంఘిక సంక్షేమ శాఖ పనితీరును పర్యవేక్షించేందుకు డిప్యూటీ డైరక్టర్ వున్నప్పటికీ కార్యాలయంలో జరుగుతున్న అవకతవకలను నియంత్రించలేక పోతున్నారు. దీంతో ఈ కార్యాలయంలో సంవత్సరాల తరబడి ఒకే విభాగంలో విధులు నిర్వహిస్తున్న "త్రిమూర్తులు"గా పిలవబడే సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు. జెడికి అందిన ఫిర్యాదులపై విచారణ చేపట్టినప్పటికీ ఫిర్యాదు చేసిన వారు హాజరుకాక పోవడంతో వివరాలను సేకరించలేక పోయారు. రఘురాంకు గతంలో సాంఘిక సంక్షేమ శాఖ డిప్యూటీ డైరక్టర్‌గా పనిచేసిన అనుభవం వుంది. విచారణలో నమోదు చేసుకొన్న వివరాలను నివేదిక రూపంలో ప్రభుత్వానికి సమర్పించనున్నారు.

● పోతిరెడ్డిపాడు

# హెడ్‌రెగ్యులేటర్‌ను పట్టించుకోండి!

## నెల్లూరులో అఖిలపక్షం డిమాండ్

పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ నిర్మాణాన్ని త్వరితగతిన పూర్తి చేయాలని అఖిల పక్షం డిమాండ్ చేసింది. స్థానిక ఎన్‌టిఆర్ భవన్‌లో తెలుగుదేశం, సిపిఎం, సిపిఐల ఆధ్వర్యంలో ఏర్పడిన అఖిలపక్షం విలేకరుల సమావేశం ఆగష్టు 9న నిర్వహించింది. తెలుగుదేశం పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ పోతిరెడ్డిపాడు హెడ్‌రెగ్యులేటర్ నిర్మాణాన్ని పూర్తిచేసి, రైతాంగాన్ని ఆదుకోవాలన్నారు. ఈ నిర్మాణం పూర్తయితే నీటిని నిల్వ చేసుకొనే సామర్థ్యం పెరుగుతుందన్నారు. ఇప్పటికే 33 టిఎంసిల నీరు వృథాగా సముద్రంలో కలుస్తున్నాదన్నారు. సోమశిల, కండలేరు జలాశయాల్లో నీటి నిల్వలు వుండాల్సిన దానికంటే చాలా స్వల్పంగా, అదీ డెడ్‌స్టోరేజ్‌గా వున్నాయన్నారు. దీనిని దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం రెగ్యులేటర్ నిర్మాణ పనులు త్వరితంగా పూర్తిచేయాలని డిమాండ్ చేశారు. ధర్మల్ ప్రాజెక్టుల ఏర్పాటు కారణంగా రైతులకు ఇస్తున్న నష్టపరిహారం 3.5 లక్షల రూపాయలు కావడం అఖిలపక్ష పోరాట ఫలితమేనని తెలిపారు. ఈ అఖిలపక్ష సమావేశంలో తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర, సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్, సిపిఐ జిల్లా కార్యదర్శి రామరాజు, తదితరులు పాల్గొన్నారు.




**విలేకరుల సమావేశంలో చంద్రమోహన్‌రెడ్డి.**

# మహమ్మద్ రఫి మ్యూజికల్ నైట్ 17న!



**బ్రోచర్‌ను విడుదల చేస్తున్న నగర ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి.**

నెల్లూరులో గత 20ఏళ్లుగా యాదేరఫి పేరిట జరుగుతున్న మహమ్మద్ రఫి మ్యూజికల్ నైట్ కార్యక్రమం 17వ తేది అనిల్ గార్డెన్స్‌లో నిర్వహిస్తున్నట్లు కార్యక్రమ నిర్వాహకుడు జాకీర్ హుస్సేన్ చెప్పారు. కార్యక్రమ వివరాల బ్రోచర్‌ను 11వ తేది సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి విడుదల చేశారు. ఈసారి యాదేరఫి కార్యక్రమంలో ప్రఖ్యాత గాయకులు ఎత్లేషాం, రాము, సిమ్రాన్, ఇబ్రహీంలతోపాటు స్థానిక గాయకులు జీలు, గౌస్‌బాష, మహమ్మద్ అస్లాం, సుజాత, శిరీష, అమల రఫి పాడిన మధురగీతాలను ఆలపిస్తారు. సినీ హాస్య నటుడు అలీకి మహమ్మద్ రఫి జ్ఞాపికతో ఘనసత్కారం చేయనున్నారు. కళాప్రియులు, రఫి అభిమానులు ఈ కార్యక్రమానికి విచ్చేసి జయప్రదం చేయమంటున్నాడు జాకీర్ హుస్సేన్.

# జడ్పీ అతిథి గృహానికి నామ్‌కేవాస్తే మరమ్మత్తులు!

జిల్లా పరిషత్ అతిథి గృహానికి మరమ్మత్తులు చేపట్టారు. శిథిలావస్థకు చేరుకున్న అతిథి గృహం అసాంఘిక కార్యకలాపాలకు నిలయంగా మారింది. ఈ విషయం ఉన్నతాధికారుల దృష్టికి వెళ్లడంతో మరమ్మత్తులు చేపట్టి వినియోగంలోకి తీసుకురావాలని నిర్ణయించారు. మరమ్మత్తుల కోసం 5 లక్షల రూపాయలు కేటాయించారు. పనిలోపనిగా జడ్పీ కార్యాలయం, ప్రక్కనే వున్న ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్ కార్యాలయం మరమ్మత్తులు కూడా చేసేస్తున్నారు. వీటికి మరో 7 లక్షల రూపాయలు కేటాయించారు. ఈ పనులకు మొత్తం కలిపి టెండర్‌ను పిలిచి పనులు అప్పగించాలి. కానీ నామినేషన్ ప్రాతిపదికన పనులు అప్పగించినట్లు తెలిసింది. అధికార పార్టీకి చెందిన ఒక ఎమ్మెల్యే సిఫార్సుతో పనులు అప్పగించారని గుసగుసలు వినిపిస్తున్నాయి. ఇప్పటికే అతిథి గృహం పనులు సగం పూర్తిచేసినట్లు చూపించి బిల్లులు మంజూరు చేయించుకున్నట్లు సమాచారం. పంచాయతీరాజ్, ఇంజినీరింగ్ విభాగం ఆధ్వర్యంలో పనులు పర్యవేక్షణ జరగాల్సి వున్నా సక్రమంగా జరగడం లేదు. బయట వున్న చెట్లను తొలగించి పనులు నామమాత్రంగా చేయిస్తున్నారు. జడ్పీ కార్యాలయం మరమ్మత్తుల జోలికి ఇంకా వెళ్లలేదు.

## సోనియాగాంధీకి కాక

మొదటి పేజీ కొరవ

### కెసిఆర్‌కు ఇష్టం లేదా?

అసలు తెలంగాణ ఏర్పాటు కెసిఆర్‌కు ఇష్టం లేదా అన్న ప్రశ్న ఒకటి విన్పిస్తున్నది. ఢిల్లీ ప్రకటన తర్వాత తెలంగాణలో ఎక్కడా ఉత్సవాలు చేయ కూడదని, దానివల్ల అనవసర ఉద్రేకాలు పెరిగి అసలుకే మోసం వస్తుందని జెఎసి నేతలు ప్రజలను నిగ్రహించిన నేపథ్యంలో కెసిఆర్ మాత్రం తెలంగాణ నుంచి ఆంధ్ర ఉద్యోగులను తరిమి వేస్తామని బెదరింపు ప్రకటన చేయడం వల్ల ఈ ప్రశ్నకు అవకాశం ఏర్పడింది. దానితోనే ఆంధ్ర ఉద్యోగ సంఘాలు ఉద్యమం బాట పట్టాయి. హైదరాబాదులో పని చేసే ప్రతి ఆంధ్ర ప్రాంత ఉద్యోగీ తమ సంఘాలకు బాసటగా నిలుస్తున్నారు. కెసిఆర్ ప్రకటన లేకుంటే ఆంధ్ర సంఘాలు ఇంతగా ఉద్యమించక పోయేవి. కెసిఆర్‌కు తెలంగాణ ఏర్పాటు ఇష్టం లేక పోవడానికి కారణం – దానివల్ల వచ్చే రాజకీయ లబ్ధి మొత్తం కాంగ్రెస్‌కు మాత్రమే దక్కేలా ఢిల్లీ పెద్దలు వ్యూహం రచించడం. రాష్ట్ర విభజన కోసం పుష్కరం పాటు పోరాడిన టిఆర్‌ఎస్‌ను పూర్తిగా విస్మరించి మరీ విభజన ప్రక్రియ నడిపిస్తున్నారు వారు. అందువల్ల ఏదో ఒక రకంగా దీన్ని నిలువరించి, 2014 ఎన్నికలలో కాంగ్రెస్ మోసం చేసిందనే ప్రచారంతో అధిక సీట్లు గెలుచుకొని, అప్పుడు తెలంగాణ సాధించాలన్నది కెసిఆర్ వ్యూహంగా చెప్తున్నారు. అందు కోసమే ఆంధ్ర ఉద్యమాలను కెసిఆర్ పరోక్షంగా రెచ్చ గొట్టాడని భావిస్తున్నారు పరిశీలకులు.

### కాంగ్రెస్ ఎమ్పీల ధైర్యం

సాధారణంగా కాంగ్రెస్ ఎమ్పీలు అధిష్ఠానం అడుగులకు మడుగులొత్తుతూ వుంటారు. ధిక్కారం అనేది కలలో కూడా వుండదు. అది కాంగ్రెస్ సాంప్రదాయం. కానీ విచిత్రంగా కాంగ్రెస్ ఎమ్పీలు సమైక్యాంధ్ర నినాదంతో ఢిల్లీ పెద్దలకు కలవరం కల్గిస్తున్నారు. లోక్‌సభలో తన పార్టీ ఎమ్పీల ఆందోళనను అదుపు చేయడం సాక్షాత్తు సోనియాగాంధీకి కూడా అలవి కాలేదు. ఆహార హక్కు బిల్లు మీద పార్టీ విప్ ఉల్లంఘించి నిరసన తెలపాలన్నంత దూరం చర్చ జరిగింది మన ఎమ్పీల మధ్య. చివరకొచ్చేసరికి అంత ధిక్కారం లేకపోయినా, సోనియా నిర్ణయం మీద ఆ మాత్రం చర్చ జరపడమే విచిత్రమైన విషయం. వారిలో ఆ ధైర్యం ఎక్కడ నుంచి వచ్చింది? ఎటూ రేపటి ఎన్నికలలో గెలిచే అవకాశం లేదు కాబట్టి సోనియా తమనేమి చేయగలదన్న ధీమానా?

### ఉద్యమానికి నాయకులెవరు?

సీమాంధ్రలో జరిగే ఉద్యమానికి నాయకత్వం ఎట్లా నాయకులెవరు అన్నది ప్రశ్న. ఇప్పటివరకు ఎక్కడికక్కడ ఆయా పార్టీల స్థానిక నేతలు, ఎమ్మెల్యేలు ఉద్యమాన్ని నడిపిస్తున్నారు. అందువల్లనే దానికొక వ్యవస్థీకృత రూపం రాలేదు. ఉద్యోగులు, మరీ ముఖ్యంగా ఆర్టీసి ఉద్యోగులు సమ్మె కడుతున్నారు కాబట్టి ప్రజలకూ ఉద్యమం సెగ తగులుతున్నది. అయితే కేవలం ఉద్యోగులతో ఉద్యమం ఎంత కాలం నడుస్తుందన్నది ప్రశ్న. కాంగ్రెస్, తెలుగుదేశం, జగన్ పార్టీలు మూడూ విడివిడిగా ఉద్యమ కార్యక్రమాలు నిర్వహిస్తుండడం వల్ల దానికి వ్యవస్థీకృత రూపం రావడం లేదు. పైగా వైఎస్ విజయమ్మ దీక్ష చేస్తానంటే తెలుగుదేశం వాదులు ఎగతాళి చేస్తున్నారు. తెలుగుదేశం ఎమ్మెల్యే దేవినేని ఉమ దీక్ష అంటే కాంగ్రెస్‌వాదులు గేలి చేస్తున్నారు. కాంగ్రెస్ మంత్రి తోట నరసింహం సతీమణి వాణి దీక్ష చేస్తుంటే జగన్ పార్టీ ఎగతాళి చేస్తున్నది. ఉద్యమంలో ఇన్ని పాయలు, ఇన్ని చీలికలు ఏర్పడి, అవి సమాంతర రేఖలుగా ప్రయాణిస్తే ఇక ఉద్యమం ముందుకు సాగడం సాధ్యమా?

### ముఖ్యమంత్రి మార్పు వీలు కాదు

మొత్తానికి రాష్ట్రంలో ఒక విధమైన అయోమయం ఏర్పడి వుంది ఇప్పుడు. పరిపాలన పూర్తిగా స్థంభించిపోయి వుంది. ముఖ్యమంత్రిగా కిరణ్ కుమార్‌రెడ్డిని తప్పించి వేరొకరిని నియమిస్తే పరిస్థితి కొంత మెరుగు పడవచ్చునని మొదట ఆలోచన చేశారు. కానీ ఇప్పుడా పరిస్థితి దాటిపోయింది. ఈ దశలో తెలంగాణ వాదులైన జైపాల్‌రెడ్డి వంటి వారిని ముఖ్యమంత్రి పీఠం మీద కూర్చోబెట్టడం జరిగే పని కాదు. ఆంధ్ర ప్రాంతం కాంగ్రెస్ వాదులెవరూ తెలంగాణ నేత మంత్రివర్గంలో సభ్యులు కావడానికి ముందుకు రారు. ఆంధ్ర ప్రాంతం నుంచి ఉద్యమ అణిచివేత బాధ్యత తీసుకొని పదవి చేపట్టడానికి ముందుకొచ్చేవారు ఎవరూ లేరు. ఇక మిగిలింది రాష్ట్రపతి పాలన మాత్రమే. అయితే రాష్ట్రపతి పాలన విధించడానికి అవసరమైన స్థాయిలో శాంతి భద్రతల పరిస్థితి అదుపు తప్పలేదు. అందువల్ల తొందరపడి ఆ నిర్ణయం తీసుకోలేరు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

సలహాతో ఇప్పటికీ ఆయన ఈ కార్యక్రమం కొనసాగిస్తున్నారు. పోస్టులోనో, ఫోన్‌లోనో శుభాకాంక్షలు పంపక స్వయంగా వచ్చి కార్డు ఇవ్వడం కూడా అవనిగడ్డలో ప్రత్యేకతగా చెప్పుకోవాలి. శుభాకాంక్షల పత్రంలో దేశభక్తి పూరితమైన సందేశాలు కూడా వుండడం ప్రత్యేకం చెప్పుకోవాలి.



### మార్కెట్ కిటకిట!

సమైక్యాంధ్రకు మద్దతుగా కూరగాయల మార్కెట్‌ను ఒక్క రోజు మూసివేస్తున్నారని ప్రకటించడంతో వినియోగదారులు బారులు తీరారు. ఆగష్టు 13న బంద్ కారణంగా కూరగాయలు కొనుక్కొనేందుకు వచ్చే వారితో మార్కెట్ కిటకిటలాడింది. ఇదే అదునుగా వ్యాపారులు కూరల ధరలను అమాంతం పెంచేశారు. టమోటాలు, వంకాయలు, తదితర కూరల రేట్లు చుక్కలనంటాయి. బంద్ వలన కూరలు దొరకవేమోనని, అధిక ధరలు పలుకుతాయే మోనని విని యోగదారులు హైరానా పడడాన్ని అవకాశంగా చేసుకొని వ్యాపారులు నిలువు దోపిడీ చేశారు. గతంలో ఎన్నడూ లేనంతగా మార్కెట్ వినియోగదారులతో నిండిపోయింది.



వెంకటగిరి కాంగ్రెస్ నాయకులతో తాజా రాజకీయాలపై చర్చిస్తున్న నేదురుమల్లి రాంకుమార్‌రెడ్డి.

### ప్రకాశం విగ్రహానికి మెట్లు పెట్టాలి!

ఆంధ్ర రాష్ట్ర మొట్టమొదటి ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశం పంతులు విగ్రహం వద్ద శాశ్వతంగా మెట్లు ఏర్పాటు చేయాలని టిడిపి కార్యనిర్వాహక కార్యదర్శి ఉచ్చి భువనేశ్వర ప్రసాద్ కోరారు. ఈ మేరకు ఆయన మున్సిపల్ కమిషనర్‌ను కలసి వినతిపత్రం సమర్పించారు. వర్ధంతి, జయంతుల సందర్భంలో పూలమాల వేయడానికి, నివాళులు అర్పించడానికి తాత్కాలికంగా మెట్లు ఏర్పాటు చేసుకోవాల్సి వస్తున్నదని, దీనిని దృష్టిలో వుంచుకొని శాశ్వత ప్రాతిపదికన మెట్లు నిర్మించాలన్నారు.

### నిన్న అతడు నేడు హిజ్రా

కట్టుకొన్న భర్త వున్నట్లుండి హిజ్రాగా మారితే ఆ భార్య మనసుపడే ఆవేదన వర్ణనాతీతం. అలాంటి ఘటన నగరంలో చోటుచేసుకోవడంతో ఆ కుటుంబం కన్నీరుమున్నీరవుతుంది. కోటమిట్టకు చెందిన గౌస్‌బాషా ఆటో నడుపుకుంటూ జీవనం సాగించేవాడు. పెళ్లి చేసుకొని ఇద్దరు పిల్లలతో సంతోషంగా వుండేది వారి కుటుంబం. వున్నట్లుండి గౌస్‌బాషా కన్పించకుండా పోయాడు. ఇతని కోసం కుటుంబ సభ్యులు గాలిస్తున్నారు. ఈ సమయంలో బోడిగాడి తోట వద్ద వున్నట్లు సమాచారం అందుకొన్న భార్య, కుటుంబసభ్యులు అతడిని హిజ్రా అవతారంలో చూసి అవాక్కయ్యారు. హిజ్రాలతో పరిచయం కాస్త గౌస్ బాష లింగమార్పిడి చేయించుకొని హిజ్రాగా మారిపోయాడట. దీనిపై పోలీసులకు కుటుంబ సభ్యులు ఫిర్యాదు చేయడంతో ఏ సెక్షన్ క్రింద కేసు నమోదు చేయాలో తెలియక పోలీసులు తలలు పట్టుకొన్నారు.

### కృష్ణచైతన్య విద్యార్థుల భారీ ర్యాలీ

నెల్లూరు కృష్ణచైతన్య విద్యాసంస్థల యాజమాన్యం విద్యార్థులతో సమైక్యాంధ్రకు మద్దతుగా నగరంలో భారీ ర్యాలీ నిర్వహించింది. ఆగష్టు 12న జరిగిన ఈ ర్యాలీలో అధికసంఖ్యలో విద్యార్థులు పాల్గొని జై సమైక్యాంధ్ర అంటూ చేసిన నినాదాలతో నగరం మారుమ్రోగి పోయింది. విద్యాసంస్థల నిర్వాహకులు చంద్రశేఖర్‌రెడ్డి, కృష్ణారెడ్డి ముందుండి ఈ ర్యాలీని నడిపించారు. విద్యార్థులు లేకుండా ఏ కార్యక్రమం జయప్రదం కావడం లేదనేందుకు ఇదో ఉదాహరణ.

### మరణం

సెంట్రల్ ఎక్సైజ్ శాఖలో సూపరింటెండెంట్‌గా పని చేసి స్వర్గస్తులైన మైనంపాటి సుబ్బయ్య సతీమణి సరోజిని (87) ఆగష్టు 10తేదీ నెల్లూరులో మరణించారు. ఈమెకు నలుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. మాతృమూర్తిని కోల్పోయిన వీరి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

యతీ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ పరిస్థితి మరీ దిగజారిపోయింది. 2009 ఎన్నికల్లో ఆమెకు ఎమ్మెల్యే టిక్కెట్టు ఇవ్వకపోయినా కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి తరపున విస్తృతంగా ప్రచారం చేశారామె. రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు పార్వతమ్మను విస్మరించడం వల్లే కావలిలో కాంగ్రెస్‌కు దుర్దినాలు దాపురించాయి. ఇప్పటికైనా పార్టీ పార్వతమ్మ సేవలను ఉపయోగించుకోవాలి. ఆమెను గవర్నర్ కోటాలో శాసన మండలికి పంపాలి.

ఎస్.బి.రావు, కావలి

### విడవలూరు గ్రంథాలయం!

విడవలూరు గ్రామంలో జిల్లా గ్రంథాలయ సంస్థ నేతృత్వంలో ఎన్నోఏళ్లుగా గ్రంథాలయం నడుస్తుంది. ఈ గ్రంథాలయంలోని విలువైన పుస్తకాలు, పత్రికలు చదివి ఎందరో కలెక్టర్లు, ఎస్పీలు, డాక్టర్లు, శాస్త్రవేత్తలయ్యారు. డిగ్రీ, జూనియర్ కాలేజి, హైస్కూల్, బిసి, ఎస్సీ, హాస్టల్లకు దగ్గరగా వుండే ఈ గ్రంథాలయాన్ని ఇటీవల సరిగ్గా తీయడం లేదు. ఇంగ్లీషు న్యూస్ పేపర్లు రావడం లేదు. ఈ గ్రంథాలయాన్ని సరిగ్గా తీసి అన్ని పుస్తకాలు, వార్తాపత్రికలు వుండేలా సంబంధిత అధికారులు చర్యలు తీసుకోమనవి.

ఎస్.అనూరాధ, విడవలూరు

### బాధాకరం!

ఆంధ్రప్రదేశ్‌ను తెలుగు జాతిని రెండుగా కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం చీల్చడం బాధాకరం. తెలంగాణ ప్రాంతీయులు ప్రత్యేక రాష్ట్రం కావాలని ఎన్నో ఏళ్లుగా ఉద్యమిస్తూనే వున్నారు. ఈ మధ్య వారు సద్దుమణిగిన వేళ కాంగ్రెస్ పార్టీ రాజకీయ కారణాలతో మళ్లీ ఈ విభజన నెగడు వెలిగించింది. హైదరాబాద్‌ను అందరూ కలసి అభివృద్ధి చేసుకొన్నారు. దానితో సహ రాష్ట్రాన్ని ముక్కలు చేస్తామని కాంగ్రెస్ ప్రకటించినా, నేతలు ఊరుకొన్నా ప్రజలు గమ్మునుండరు, ఉద్యమిస్తారు. రాష్ట్ర విభజన రావణ కాష్టం లాంటిదని చెప్పక తప్పదు.

సోలా జానకీదేవి, నెల్లూరు

## పదరంగం -80

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | ■ | 3 | 4 | 5 | ■ | 6 |
| | ■ | 7 | 8 | 9 | ■ | 10 | | 11 | ■ |
| | ■ | 12 | | | ■ | | ■ | 13 | 14 |
| ■ | 15 | ■ | ■ | 16 | | | | ■ | |
| 17 | | 18 | ■ | ■ | ■ | ■ | ■ | 19 | |
| ■ | 20 | | 21 | ■ | 22 | | 23 | | |
| 24 | ■ | 25 | | 26 | | ■ | | ■ | ■ |
| 27 | 28 | ■ | ■ | 29 | | | ■ | 30 | 31 |
| 32 | | | ■ | 33 | | ■ | 34 | | |
| 35 | | ■ | 36 | | | ■ | 37 | | ■ |

**అడ్డం**

1. భూమి (3)
3. పాతకము చేసిన స్త్రీ (3)
6. ఇంగ్లీషు ఉచితం (1)
7. పుట్టుక, మరణం కాదు (3)
10. లక్ష (3)
12. ఓల్డ్, వృద్ధుడు (3)
13. ఇవి నూనెవికాదు "...."గారెలు (2)
16. జీవనం, బ్రతుకు (4)
17. పాన్పు, పక్క (3)
19. అసమ కాదు సమానం (2)
20. తెలుగు గ్రాస్ హోపర్ (3)
22. ముందు మాట (5)
25. క్షణకాలం (4)
27. స్మశానం (2)
29. అటునుంచి ఒంటరివాడు (3)
30. తెలుగు వేస్ట్ (2)
32. మూషికం (3)
33. పీచు (2)
34. పడమర (3)
35. అటునుంచి రుణం (2)
36. తెలుగు డిస్టెన్స్ (3)
37. వంటకం (2)

**నిలువు**

1. అతి గల స్త్రీ (3)
2. అబద్ధము కాదు (3)
4. తలగుడ్డ, టర్బన్ (4)
5. క్రింద నుంచి వాయసం (2)
8. వగరు, సణుగుడు (2)
9. క్రింద నుంచి మురికి (3)
11. క్రిందనుంచి తమిళ సహాయం, అపరాధం (2)
14. కన్‌ఫ్యూజన్, అవకతవక (4)
15. నేల (3)
18. సముద్రం (3)
19. బేసి కాదు (2)
21. కాల్చబడిన (2)
22. తెలుగు డెకరేషన్ (5)
23. రజ్జువు (2)
24. వెంటనే, సరాసరి నేరుగా (4)
26. తూర్పుగోదావరి పట్టణం (4)
28. క్రింద నుంచి అబ్బాయి (3)
30. తేలు (3)
31. గృహము, భవంతి (3)
34. క్రిందనుంచి చిన్న బాలిక (2)

**సమాధానాలు**

## పదరంగం -79

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఏ | మ | 2 రు | పా | 3 టు | ■ | 4 ము | స | 5 లి | ■ |
| ను | ■ | వా | ■ | 6 చే | 7 రి | క | ■ | 8 క | 9 పి |
| 10 గు | 11 ణ | క | ము | ■ | 12 పు | స్త | కం | ■ | లు |
| ■ | 13 కం | ఏ | ■ | 14 న | డు | మ | ■ | 15 కై | పు |
| 16 కై | క | ■ | 17 అ | ల | ■ | ■ | 18 బా | వ | ■ |
| 19 వ | ము | 20 దై | ■ | 21 క | 22 ల | 23 శం | ■ | 24 శం | 25 క |
| ల్యం | ■ | 26 నం | 27 తి | ■ | 28 శా | పా | 29 లు | ■ | న్ను |
| ■ | 30 గు | ది | బం | 31 డ | ■ | ■ | 32 తే | 33 రు | ■ |
| 34 న | ట | న | ■ | 35 ఆ | 36 ర | 37 ణం | ■ | 38 వే | 39 ట |
| 40 త్తి | క | ■ | 41 క | ■ | 42 వి | క | లం | ■ | ఆ |

# సంక్షిప్త సింహపురి

## సమైక్యాంధ్రే సిపిఎం విధానం!



త్వరలో జరుగనున్న లోక్‌సభ ఎన్నికలలో లబ్ధిపొందాలనే ఉద్దేశ్యంతోనే కాంగ్రెస్ పార్టీ అధిష్టానం ఆంధ్రప్రదేశ్‌ను రెండుగా విభజన చేయాలన్న నిర్ణయాన్ని ప్రకటించిందని సిపిఎం నెల్లూరు నగర కార్యదర్శి మాదాల వెంకటేశ్వర్లు అన్నారు. చిల్డ్రన్స్ పార్క్ వద్ద జరిగిన సిపిఎం కార్యకర్తల సభలో ఆయన పాల్గొని ప్రసంగించారు. ఆంధ్రప్రదేశ్ భాషా ప్రాతిపదికన ఏర్పాటైన రాష్ట్రం. ఇది సమైక్యంగానే ఉండాలని సిపిఎం పార్టీ ముందు నుంచి చెబుతుంది. కానీ కాంగ్రెస్, వైసిపి, టిడిపిలు అవకాశవాదంతో వ్యవహరించి తెలంగాణాలో ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని సమర్థించాయని, అవే పార్టీలు సమైక్యాంధ్రంటూ ప్రజలను మోసపుచ్చే ప్రయత్నం చేస్తున్నాయన్నారు. నిజంగా సమైక్యాంధ్ర కోసం పోరాటం చేయాలన్న చిత్తశుద్ధి వారికుంటే ద్వంద్వ వైఖరి అవలంభిస్తున్న వారి వారి పార్టీలకు ముందుగా రాజీనామా చేసి ఉద్యమంలో పాల్గొనాలన్నారు. సిపిఎం తెలంగాణ, సీమాంధ్ర ప్రాంతాలలో ఎక్కడా విద్వేషాలకు, సంకుచితత్వ దురహంకార భావాలకు గురి కాకుండా సమైక్యాంధ్రప్రదేశ్ నినాదంతో ప్రజల మధ్య ఐక్యత కాపాడేందుకు కృషి చేస్తుందని, నిత్యం ప్రజా సమస్యల పరిష్కారానికి కృషి చేస్తుందన్నారు. సభలో సిఐటియూ నగర కార్యదర్శి కత్తి శ్రీనివాసులు, నగర సెక్రటేరియేట్ సభ్యులు జి.నాగేశ్వరరావు, రెండు, మూడవ జోన్ల కన్వీనర్లు పి.సూర్య నారాయణ, కొండా ప్రసాద్ కూడా పాల్గొన్నారు.

## పెద్దాసుపత్రిలో వైద్యసేవలు సరిలేవు!



నెల్లూరు పెద్దాసుపత్రిలో వైద్యసేవలు సామాన్యులకు అందుబాటులో లేవని లోక్‌సత్తా పార్టీ జిల్లా అధ్యక్షులు మక్కెన అంకయ్య చౌదరి ఆరోపించారు. వైద్యశాలకు సిబ్బంది సమయానికి రావడం లేదని, వచ్చేవారిలో సేవాభావం లేదన్నారు. మందులు, వైద్య సేవలు కూడా ఇక్కడ అందడం లేదన్నారు. పేద ప్రజలు పెద్దాసుపత్రిలో సరిగ్గా వైద్యమందక, ప్రైవేటు ఆసుపత్రికి వెళ్లలేక ఇబ్బందులు పడుతున్నారన్నారు. లోక్‌సత్తా బృందం ఆసుపత్రి తనిఖీకి వెళ్లగా వాడిన సూదులు, ప్లాస్టిక్ సిరంజిలు, సర్జికల్ పరికరాలు, సెలైన్ బాటిల్స్, దూది గుడ్డలు ఒకే చోట పారవేయడం వల్ల పారిశుద్ధ్యం బాగా దెబ్బతిని పందులు సంచరించడం గమనించామన్నారు. ఇదే విషయాన్ని ఆర్ఎంఓ దృష్టిగా తీసుకెళ్లగా శానిటేషన్ పనిని కాంట్రాక్ట్‌కు ఇచ్చి వున్నారని, మార్చురీలో ఫ్రీజర్స్ దెబ్బతినడం వల్ల పెద్దాసుపత్రిలో శవాలను జాగ్రత్త పర్చే పరిస్థితి లేకుండా పోయిందన్నారు. ఈ విషయాలను జిల్లా కలెక్టర్ దృష్టికి కూడా తీసుకెళ్తామని అంకయ్య చౌదరి స్పష్టం చేశారు.

## యువజన విభాగ్ రాష్ట్ర అధ్యక్షునిగా రామకృష్ణ!

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ యువజన విభాగ్ రాష్ట్ర అధ్యక్షునిగా కావలికి చెందిన తంగుటూరి రామకృష్ణ నియమితులయ్యారు. రామకృష్ణ గతంలో ఎసి ఛాంబర్ ఆఫ్ కామర్స్ రాష్ట్ర కార్యదర్శిగా, వాసవీ సేవాదళ్ రాష్ట్ర అధ్యక్షునిగా, ప్రపంచ ఆర్యవైశ్య మహాసభ కన్వీనర్‌గా, దరిశి సేవా సంస్థ కన్వీనర్‌గా వివిధ బాధ్యతలు నిర్వహించారు. రాష్ట్రవ్యాప్తంగా గ్రామస్థాయి నుండి పట్టణ స్థాయి వరకు యువశక్తిని సంఘటిత పరచి యువజన విభాగ్ శాఖలను పటిష్టపరచి రాబోయే రెండేళ్లలో విస్తృత సేవా కార్యక్రమాలు నిర్వహిస్తానన్నారు. తన నియామకానికి సహకరించిన ఆర్య వైశ్య మహాసభ అధ్యక్షులు కాళ్లకూరి శ్రీరామ నాగేశ్వరరావు, తమిళనాడు గవర్నర్ రోశయ్యకు కృతజ్ఞతలు చెల్లించారు.

## మహిళా సమస్యల పరిష్కారానికి కృషి!




హైదరాబాద్‌లోని గాంధీభవన్‌లో రాష్ట్ర మహిళా కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో రాష్ట్ర అధ్యక్షురాలు ఆకుల లలిత అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశంలో జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ పాల్గొని ఉపన్యసించారు. రాష్ట్రంలో మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలు వాటి పరిష్కారానికి మహిళా కాంగ్రెస్ చేపట్టాల్సిన పనుల గూర్చి చెప్పారు. ఈ మధ్య మహిళా సంక్షేమం కోసం రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకాల గూర్చి వివరించారు. ఈ సందర్భంగా గాంధీభవన్‌లో పిసిసి అధ్యక్షుడు బొత్స సత్యనారాయణను కలసిన అరుణమ్మ ఆయనకు శాలువ కప్పి సత్కరించారు.

## సమైక్యాంధ్ర వైపే రిటైర్డ్ ఉద్యోగులు!

సమైక్యాంధ్ర ఉద్యమంలో ఎపి ఎన్‌జిఓలు చేసే పోరాటానికి ఎపి స్టేట్ గవర్నమెంటు రిటైర్డ్ ఎంప్లాయిస్ అసోసియేషన్ నెల్లూరు జిల్లా శాఖ తమ పూర్తి మద్దతు తెలిపింది. ఎన్‌జిఓలు చేసే ప్రతి నిరసన కార్యక్రమంలో పెన్షనర్లు అధిక సంఖ్యలో పాల్గొంటారని అసోసియేషన్ జిల్లా కార్యదర్శి ఐ.లక్ష్మీనారాయణ స్పష్టం చేశారు.



రైతు లోకం

# ఎరోబిక్ వరి సాగు పద్ధతులు

**గతవారం తరువాయి భాగం**

**కలుపు యాజమాన్యం:** ఈ పద్ధతిలో నీరు నిలగట్టడం వుండదు. కాబట్టి కలుపు సమస్య ఎక్కువగా వుంటుంది. కలుపు నివారణకు సమగ్ర నివారణ చర్యలు చేపట్టాలి. విత్తిన పిదప భూమిలో తగు మాత్రం తేమ వుండే పరిస్థితులలో కలుపు మందు వాడాలి. ఒక ఎకరాకు 1 లీటరు పెండిమిథాలిన్ లేదా 400 మిల్లీలీటర్లు ప్రిటిలాక్లోర్ మరియు సీఫనర్ లేదా 35 గ్రాముల ఆక్సాడయార్జిల్ వంటివాటిలో ఏదో ఒక మందును 200 లీటర్ల నీటితో కలిపి భూమిపై విత్తిన 2 – 3 రోజుల్లోపల పిచికారి చేయాలి. విత్తిన 15 – 20 రోజులకు కలుపు ఉధృతిని బట్టి బిస్‌ఫైరిబాక్ సోడియం అనే మందును 80 – 100 మిల్లీలీటర్లు లేదా వెడల్పాకు కలుపు ఎక్కువగా ఉన్నప్పుడు 400 గ్రాములు 2,4–డి సోడియం సాల్ట్ అనే మందును పిచికారి చేయాలి. అయితే అన్ని రకాల కలుపు మొక్కలు ఉన్నప్పుడు 30 రోజుల తర్వాత ఒకసారి మనుషులతో కలుపు తీసి గొప్పు తవ్వించడం వల్ల కలుపు మొక్కలు నశించడమేగాక భూమి గుల్లబారి ఎక్కువ తేమ భూమిలో నిలువ వుంటుంది. తద్వారా పంట త్వరగా బెట్టకి గురికాకుండా చూడవచ్చు. పంట వరుసల్లో విత్తినట్లయితే వరుసల మధ్య అంతరకృషి చేసుకోవచ్చు. దీనివల్ల తక్కువ ఖర్చుకు కలుపును నివారించవచ్చు.

డాక్టర్ వై.సూర్యనారాయణ
ప్రధాన శాస్త్రవేత్త,
వ్యవసాయ పరిశోధనా స్థానం, నెల్లూరు.

**నీటి యాజమాన్యం:** పంటకు ప్రతి 7–10 రోజులకొకసారి అవసరం మేరకు నీటి తడులు పెట్టాలి. ఎరోబిక్ వరికి పొలంలో ఎల్లప్పుడు నీరు నిలువ వుంచవలసిన అవసరం లేదు. అయితే పంటకు కావలసిన తేమను అందించడం పంట కీలక దశల్లో బెట్టకు గురికాకుండా చూడడం ప్రధానమైన అంశం. అధిక వర్షాలు నమోదైనప్పుడు నీటి తడులు అవసరం వుండదు. ఈ విధంగా ఖరీఫ్‌లో 3–4 తడులలో వరిసాగు చేసుకునే అవకాశం వుంది. నీటిని 40–50% మేర ఆదా చేసుకోవచ్చు.

కొరవ వచ్చేవారం

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14
జమీన్‌రైతు

## సమైక్యాంధ్ర... జైఆంధ్రా

# ఉద్యమాలకు మధ్య ఎంతో తేడా!

సమైక్యాంధ్ర ఉద్యమం పట్ల ప్రజల స్పందన ఏమిటి అన్న ప్రశ్నకు ఎవరికీ సమాధానం దొరకడం లేదు. టీవీ ఛానళ్లలో దృశ్యాలు చూస్తే మాత్రం రాష్ట్రం మొత్తం ఉద్యమం వేడితో భగ్గుమంటుందన్న భావన కల్గుతున్నది. కానీ వాస్తవ పరిస్థితి చూస్తే వేరుగా వుంది. నెల్లూరు జిల్లా వరకు చూస్తే ఈ పదిహేడు రోజులు ఉద్యమంలో ప్రజల పాత్ర చాలా పరిమితం. ఏ పార్టీకి ఆ పార్టీ స్థానిక నేతలు తమ ఉనికి కోసం ఏదో ఒక కార్యక్రమం చేపడుతున్నారు. అయితే వాటిలో పాల్గొనే జనం మాత్రం ఉద్యమం మీద ఆవేశంతో, ఉద్రేకంతో, లక్ష్యంతో, ఇష్టంతో వస్తున్న వారు కారన్నది నిజం. మామూలు రాజకీయ సభలకు జనాన్ని సమీకరించినట్లే, ఉద్యమ కార్యక్రమాలకు కూడా పోగేస్తున్నారు. అందువల్ల ఆ కార్యక్రమంలో ఉత్సాహం కన్పించడం లేదు. టీవీ ఛానల్ విలేకరులు వచ్చి కెమెరాలతో షూటింగ్ చేసుకొన్నంత సేపు మాత్రమే కార్యక్రమం నడుస్తున్నది. ఆ పక్క క్షణం చెల్లాచెదురై పోతున్నారు. జనం కొరత తీర్చుకోవడానికి విద్యా సంస్థల మీద ఆధారపడుతున్నారు. ఐదు, ఆరూ తరగతులు చదివే పసి పిల్లలను కూడా అయ్యవార్లు దగ్గరుండి వీధులలో నడిపిస్తున్నారు. ఆ వయస్సులోని పిల్లలకు రాష్ట్ర విభజన వంటి సంక్లిష్ట సమస్యల మీద అవగాహన వుంటుందని భావించడం సరికాదు.

ఒక్కసారి నలభై ఏళ్ల క్రితం జరిగిన జై ఆంధ్రా ఉద్యమాన్ని జ్ఞాపకం చేసుకొంటే రాష్ట్ర విభజన అంశంలో ప్రజల భాగస్వామ్యం ఏ రీతిలో వుండాలో, వుంటుందో అర్థమౌతుంది. జై ఆంధ్రా ఉద్యమం ప్రజల మనస్సులలో నుంచి పుట్టుకొచ్చింది. అందువల్ల ఉద్యమం మొత్తం మహోద్రేకంతో సాగింది. ఈ జిల్లా ఆ జిల్లా అనే తేడా లేకుండా ఆంధ్ర, రాయలసీమ మొత్తం సెగలు పొగలు చిమ్మింది. బివి.సుబ్బారెడ్డి, కాకాని వెంకటరత్నం వంటి నేతలు ముందు వరసలో నిలిచారు. విజయవాడలో ఆందోళనకారుల మీద పోలీసు కాల్పులు జరిగిన రోజే కాకాని వెంకటరత్నం గుండె పోటుతో మరణించాడు. దాన్ని బట్టి ఉద్యమాన్ని ఆయన ఎంత గాఢంగా హృదయానికి హత్తుకొన్నాడో అర్థమౌతుంది. బివి.సుబ్బారెడ్డి అయితే మరొక అడుగు ముందుకేసి, 300 మంది యువకులతో ఒక ఆత్మహూతి దళం ఏర్పాటు చేశాడు. ఉద్యమానికి సహకరించని ఎమ్మెల్యేలు, సమితి అధ్యక్షులను చంపాలన్నది ఆయన వ్యూహం. ఆ ఆత్మహూతి దళంలో మొదటి సమిధగా తానే మారుతానని చెప్పేవాడు. మరొకప్రక్క విద్యార్థులు తమ ప్రాణాలకు తెగించి పోరాటం చేశారు. వెంకయ్య నాయుడు, మాదాల జానకిరాం, వసంత నాగేశ్వర రావు వంటి నేతలు ఆ ఉద్యమం నుంచి పుట్టుకొచ్చినవారే. మాదాల జానకిరాం అయితే నెల్లూరు టౌన్‌హాల్లో జరిగిన ఒక సభలో ఢిల్లీ పెద్దల రక్తం త్రాగుతామని శపథం చేశాడు. గుంటూరు జిల్లాకు చెందిన ఒక యువతి వినేవారి రక్తం మండే స్థాయిలో ప్రసంగాలు చేసింది. ఉద్యమం కోసం వీరంతా నెలల తరబడి జైళ్లలో మ్రగ్గారు. పోలీసు చిత్రహింసలు అనుభవించారు.

కానీ ఇప్పటి ఉద్యమ నేతలలో ఆ చిత్తశుద్ధి కాగడా వేసి వెతికినా కన్పించడం లేదు. ఏదో మొక్కుబడి తంతుగా నడిపిస్తున్నారు. అందుకు కారణం రాష్ట్ర విభజన ఎందుకు వద్దు, సమైక్యాంధ్ర ఎందుకు కావాలి అన్న విషయమై ఏ రాజకీయవాదిలోనూ స్పష్టమైన అవగాహన లేదు. జై ఆంధ్రా ఉద్యమం పుట్టుకకు కారణం – ఉద్యోగాల సమస్య. ఇప్పటి ఉద్యమం నడవడానికి కారణం ఉద్యోగుల సమస్య. రెండింటికీ చాలా తేడా వుంది. అప్పట్లో ఉద్యోగం అంటే ప్రభుత్వం మాత్రమే. నిజాం ప్రభువు 1919 జారీ చేసిన ఒక ఫర్మానా ప్రకారం హైదరాబాదులో కేవలం స్థానికులకు మాత్రమే ఉద్యోగాలు ఇవ్వాలి. వాటినే ముల్కీ రూల్స్ అని పిలిచేవారు. సుప్రీంకోర్టు ఆ ఫర్మానా చెల్లుబాటు అవుతుందని తీర్పు చెప్పడంతో, ఆంధ్ర ప్రాంతంలో విద్యార్థుల గుండెలు మండిపోయాయి. సమైక్య రాష్ట్రంలో తమ జీవితాలు నాశనమైపోతాయన్న భీతి నెలకొన్నది. ఆ భయాందోళనల నుంచి పుట్టినదే జై ఆంధ్రా ఉద్యమం. ఇప్పుడు కేవలం కొందరు ప్రభుత్వ ఉద్యోగులు మాత్రమే, తమకు బదలీలు వస్తాయన్న బాధతో సమ్మె బాట పట్టారు. విద్యార్థులలో ప్రభుత్వ ఉద్యోగాల మీద పెద్దగా మమకారం లేదు. వారి దృష్టి ప్రైవేటు రంగం మీదనే వుంది. పైగా ఇప్పటి ప్రభుత్వ ఉద్యోగాల పట్ల ప్రజలలో సానుభూతి లేదు. అందువల్లనే జై ఆంధ్రా ఉద్యమానికి, ఇప్పటికీ యువతీ యువకుల పాత్రలో ఎంతో తేడా కన్పిస్తున్నది.

సమైక్యాంధ్ర నినాదం సమాజంలో ఒక వర్గానికి మాత్రమే పరిమితం కావడం గమనించవచ్చు. హైదరాబాదుతో సంపర్కం, ఆస్తిపాస్తులు కల్గినవారిలో కొంత ఆందోళన వుంది తప్ప తతిమా వర్గాలలో ఇదొక పెద్ద విశేషంగా కన్పించడం లేదు. నిజం చెప్పాలంటే, కొత్త రాష్ట్రం ఏర్పడితే మనకొక కొత్త రాజధాని, దానివల్ల మన భూముల విలువ పెరగడం వంటి ప్రయోజనాలు కల్గుతాయన్న వాదన కూడా జనంలో వుంది. ప్రజలలో ఏకీభావం లేనప్పుడు రాజకీయవాదులు ఎంతకాలం ఈ ఉద్యమాన్ని సాగదీయగలరు? పోనీ రాజకీయ వాదులలో అయినా స్పష్టత, చిత్తశుద్ధి వుందా అంటే అదీ కన్పించడం లేదు. రాష్ట్ర విభజన ఎందుకు వద్దు అన్న వివరణ ప్రజలకు చెప్పలేక పోతున్నారు. ఏ కారణంతో వ్యతిరేకత చూపాలో వివరించ లేకపోతున్నారు. సమస్య హైదరాబాదా, నీళ్లా, నిధులా, ఉద్యోగాలా, బదలీలా, విద్యా వసతులా, ఆస్పత్రులా అన్న చర్చ జరపడం లేదు.

ఎమ్మెల్యేలు, ఎమ్పీలు, మంత్రులు, కేంద్ర మంత్రులు దొంగ నాటకాలాడుతున్నారు. రాజీనామా చేశామంటారు, కానీ ప్రభుత్వ కార్లలోనే తిరుగుతున్నారు. ప్రభుత్వ కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. జీతాలు తీసుకొంటున్నారు. అధికార లాంఛనాలన్నీ అనుభవిస్తున్నారు. వారిని జనం నమ్మేదెట్లా? ఆరేడు నెలలు కూడా ఆయుష్షు లేని పదవులు వదలుకోలేని వారు ఉద్యమాలు నడిపితే ఇట్లానే దిగేడుస్తాయి.

## కెవిపి మీద కన్నెర్ర!

దిగ్విజయ్ సింగ్ తెలంగాణ ఏర్పాటు ప్రకటన చేసిన రోజు ఢిల్లీలోనే వున్న కాంగ్రెస్ ఎమ్పీలు దొంగకు తేలుకుట్టినట్లు గమ్మునుండి పోయారు. లగడపాటి వంటి జగడాల మారి నేత కూడా, రాజీనామా చేసి ప్రయోజనం ఏమి వుంది, లోక్‌సభలో, శాసనసభలో మన హక్కుల కోసం గట్టిగా పోరాడుదామని తేలిక పలుకులు పలికారు. అయితే ఆ ప్రక్కరోజు రాత్రి రాజ్యసభ సభ్యుడు కెవిపి రామచంద్రరావు కొందరు కేంద్ర మంత్రులను, ఎమ్పీలను తన ఇంటికి పిలిపించుకొని, సమైక్యాంధ్ర ఉద్యమం ప్రారంభిస్తామని గట్టిగా వాదించారు. అప్పటి నుంచే కొందరు కాంగ్రెస్ ఎమ్పీలకు ధైర్యం వచ్చి, లోక్‌సభలో గోల మొదలు పెట్టారు. అప్పటి నుండి ఢిల్లీలో సమైక్యాంధ్ర నినాదాలకు, వివాదాలకు కెవిపి ఇల్లు కేంద్రంగా మారింది. రాజకీయ గొడవలకు దూరంగా తప్పించుక తిరిగే మాగుంట శ్రీనివాసులు రెడ్డి, బాపిరాజు వంటి సాత్వికులు సైతం ఉద్యమకారుల వలె ఉరకలేయడం వెనుక కెవిపి ప్రమేయం వుందని ఢిల్లీ పెద్దలు అనుమానిస్తున్నారు. ఇన్నేళ్లపాటు వూరకుండి, సమైక్యాంధ్ర గురించి ఏనాడూ నోరు తెరవకుండా, సోనియా గాంధీ ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాత దానికి అడ్డుపడాలని చూడడం వెనుక కెవిపి రాజకీయం ఏమై వుంటుందనే ప్రశ్నలు తలెత్తుతున్నాయి. వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి ప్రాణమిత్రుడిగా మెలగి కూడా, వైఎస్‌జగన్‌కు దూరంగా సంచరిస్తున్నాడు కెవిపి. అందువల్లనే వైఎస్ అవినీతి కేసులలో మంత్రులను కూడా పట్టి పీడిస్తున్న సిబిఐ కెవిపి జోలికి మాత్రం వెళ్లలేదు. కానీ ఇప్పుడు జగన్, కెవిపిల అజెండా ఒకటిగా మారింది. ఇది కేవలం ఆంధ్ర ఐక్యత మీద మమకారమా లేక జగన్ కోసం చేస్తున్న రాజకీయమా అన్న సందేహం వ్యక్తం చేస్తున్నారు ఢిల్లీ పరిశీలకులు. ఏది ఏమైనా సోనియాగాంధీ మాత్రం కెవిపి మీద కన్నెర్రగా వుందని వినికిడి.

## పనబాక బెదిరింపు



సీమాంధ్రకు చెందిన ఎమ్మెల్యేలు కేంద్రమంత్రిణి పనబాక లక్ష్మి పట్ల తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. సమైక్యాంధ్ర అవసరాన్ని అధిష్టానం పెద్దలకు నచ్చ చెప్పడం కోసం గతవారం కొందరు సీమాంధ్ర ఎమ్మె ల్యేలు ఢిల్లీ వెళ్లారు. అందరితో పాటుగా పనబాక లక్ష్మినీ కలిశారు. ఆ సమావేశంలో ఆమె, మీరు సోనియాగాంధీ నిర్ణయాన్ని ధిక్కరించాలని చూస్తున్నారు, పద్ధతి మార్చుకోకపోతే మీ మీద కూడా సిబిఐ కేసులు పెడతారు అని బెదిరింపు ధోరణిలో మాట్లాడారట. ఆమె మాట తీరు చూసి ఎమ్మెల్యేలు అవాక్కయ్యారు. మా మీద పెట్టడానికి కేసులేమి వుంటాయమ్మా అని ప్రశ్నిస్తే, మీరు మాత్రం అక్రమార్జన చేయలేదా, ఎక్కడో ఒక దగ్గర దొరక్కుండా తప్పించుకోగలరా అని ఎదురు ప్రశ్నించారట. రాష్ట్ర భవిష్యత్తు ఆలోచించమని తామడిగితే, కేసులు పెడతారని భయపెట్టడం ఏమిటని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు ఎమ్మెల్యేలు.

## లగడపాటికి చిదంబరం చురక



సమైక్యాంధ్ర నినాదంతో ఢిల్లీలో అలజడి సృష్టిస్తున్న విజయవాడ ఎమ్పీ లగడపాటి రాజగోపాల్‌కు కేంద్ర ఆర్థికమంత్రి చిదంబరం నుంచి చురుక్కుమన్పించే చురక ఎదురైందని వినికిడి. లోక్‌సభ లోపల, బయట లగడపాటి ధోరణి చూసిన చిదంబరం ఆయన్ను తన వద్దకు పిలిపించుకొని, మీ కంపెనీలు వేల కోట్లలో బ్యాంకులకు ఎగనామం పెడుతున్నారటనే, నాకు ఫిర్యాదులు వచ్చాయి, ఏమి చేయమంటారని అడిగాడట. లగడపాటికి చెందిన ల్యాంకో గ్రూప్ కంపెనీలు దాదాపు 30వేల కోట్ల రూపాయలు బ్యాంకులకు బాకీ పడి వున్నాయని అంచనా. అంత పెద్ద మొత్తంలో అప్పులిచ్చిన బ్యాంకులు, ఆ కంపెనీల నుంచి బాకీ రాబట్టలేక, అట్లని వారి మీద చర్య తీసుకోలేక సతమతమౌతున్నాయి. గట్టిగా చర్య తీసుకొంటే, ఆ బాకీలను రాని బాకీలుగా చూపి, నిరర్థక ఆస్తుల పద్దుల క్రింద చేర్చాలి. అంత పెద్ద మొత్తం ఎన్‌పిఎ క్రింద చూపితే బ్యాంకుల బ్యాలెన్స్ షీట్లు తారుమారై పోతాయి. దానితో కక్కా లేక మ్రింగాలేక తబ్బిబ్బు పడుతున్నాయి బ్యాంకులు. ఇటీవల కొంతకాలంగా చిదంబరం వేల కోట్ల అప్పులు తీసుకొని, దుర్వినియోగం చేసిన కంపెనీల మీద కఠిన చర్యలు తీసుకోమని బ్యాంకు యజమానులకు ఆదేశాలిస్తున్నారు. దేశంలో అతి పెద్ద అప్పులున్న పది కంపెనీల పేర్లను, వాటి ప్రమోటర్ల జాతకాలను పత్రికలలో వెల్లడించమని కూడా సూచించాడు. ల్యాంకో కూడా ఈ కోవకే వస్తుంది. ఒక్క లగడపాటితోనే ఆర్థికమంత్రి ఇట్లా మాట్లాడాడో లేక పెద్ద అప్పులున్న అన్ని కంపెనీల యజమానులనూ ఇదే రకంగా హెచ్చరించాడో తెలియదు. అయితే చిదంబరం విసిరిన చురకతో లగడపాటి జవజీవాలు జావకారిపోయాయి. ఆ పక్క రోజు నుంచి ఆయన గొంతు వినపడడం లేదు. సీమాంధ్ర హడావుడిలో కన్పించడం లేదు.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com